సర్వేశ్వరాయనమః.

# జ్ఞానోపదేశ సంక్షేపము.

అనగా

కథోలికు తిరుసభలో ఆచరించబడే

సుకృతమంత్రములున్ను

బోధించబడే వేదసత్యములున్ను





I. H. S.

విశాఖపట్టణములో శేంచేసియున్న

మహాఘనత వహించిన యేలినవారైన

అరుళప్ప మరియు క్లైర్క విశాఖపట్టణాపు

మేత్రాణులవారియొక్క

అనుమతిప్రకారముగా

రచియింపఁబడినది.

జేసునాథస్వామి జన్మించిన ౧౯౨౨ సం॥

Fifth Edition.

VIZAGAPATAM:

PRINTED AT THE S. S. M. PRESS.

1922.

REIMPRIMATUR

✠ JOANNES MARIA CLERC

MISS. STI. FCI. S.

*Episcopus Vizagapatami.*

*1st. May 1922.*

# జ్ఞానోపదేశము.

## ప్రారంభము.

గురువు. పరలోకమున్ను భూలోకమున్ను వాటిలో నుండే సమస్తమున్ను యెవరు సృష్టించినారు?

శిష్యుడు. సర్వేశ్వరుడు.

గు. లోకసృష్టి మొదలుకొని యిదివరకు యెన్ని సంవత్సరములు జరిగెను?

శి. కొంచె మెక్కువతక్కువ ఆరువేల సంవత్సరములు జరిగెను.

గు. సర్వేశ్వరుడు లోకమంత యెట్లు కలగ జేసినారు?

శి. ఏమిలేమినుంచి యేదొక్కకష్టములేక తమసర్వశక్తిగల వాక్యముచేత సర్వేశ్వరుడు లోకమంత కలగజేసినారు.

గు. ఎందుకొరకు సర్వేశ్వరుడు లోకము సృష్టించినారు?

జ. తమ స్తోత్రముకొరకున్ను మనుష్యుల యొక్క-
లాభముకొరకున్ను సృష్టించినారు.

గు. సర్వేశ్వరుడు యెన్నిదినములలో లోకమంత సృష్టించినారు?

జ. ఆరుదినములలో సృష్టించినారు.

మొదటిదినము ప్రకాశము కలగ జేసినారు.

రెండవదినము ఆకాశమనే పరమండలము సృష్టించినారు.

మూడవదినము భూమినిన్ని సముద్రమునున్ను వేరు వేరుగా జేసి పచ్చికనున్ను కూరలనున్ను చెట్లు చేమ ఫలాదులనున్ను కలగ జేసినారు.

నాలుగవదినము సూర్యచంద్రనక్షత్రాదులను సృష్టించినారు.

అయిదవదినము పక్షులనున్ను చేపలనున్ను యివి మొదలయినటువంటి సంచరించే జీవజంతువులనున్ను సృష్టించినారు.

ఆరవదినము పశువులనున్ను పాకే జీవజంతువులనున్ను కడాపట మన ఆది తల్లిదండ్రులనే ఆదిస్త్రీపురుషులిద్దరిని సృష్టించినారు.

ఏడవదినము సృష్టించడము మానివేసి ఆదినమునుఆశీర్వదించితమ సేవకునియమించినారు.

గు సర్వేశ్వరుడు సృష్టించిన వస్తువులలో ప్రధాన వస్తువులేవి?

శి. సమ్మనస్సులును మనుష్యులును.

గు. సమ్మనస్సులనగా నెవ్వరు?

శి. శరీరములేని జ్ఞానస్వరూపులు.

గు సర్వేశ్వరుడు సమ్మనస్సుల నెటువంటి స్థితిలో సృష్టించినారు?

శి. పరిశుద్ధమును సుఖమునైన స్థితిలో సృష్టించినారు.

గు. సమ్మనస్సులందరు తమమంచిస్థితిలో నిలకడగా నుండినారా?

శి. లేదు, వారిలో కొందరు అహంకార పాపము చేసినందువల్ల మోక్షము పోగొట్టుకొని నరకములో త్రోయబడినారు.

గు. ఈలాగున చెడిపోయిన సమ్మనస్సులకు పేరేమి?

శి. పిశాచులు.

గు. మనుష్యుడనగా నేమి?

శి. సర్వేశ్వరుని పోలికగానుండే ఆత్మయును శరీరమును గల జీవి.

గు. సర్వేశ్వరుడు యెటువంటి స్థితిలో మన ఆది తల్లిదండ్రులను సృష్టించినారు?

శి. పరిశుద్ధమున్ను సుఖమున్నైన స్థితిలో ఆయిద్ద రిని సృష్టించి శృంగారతోటలో నుంచినారు.

గు. వారు యిటువంటి మేలుల నేలాగు పోగొట్టి కొనినారు?

శి. పామురూపములో వచ్చిన పిశాచిమాటనమ్మి సర్వేశ్వరునివల్ల నిషేధించ బడిన పండు తిన్నందుచేత అటువంటి మేలులను పోగొట్టి కొని శృంగారతోటలోనుంచి తోలి వెయ్య బడినారు.

గు. ఆపాపానికి పేరేమి?

శి. జన్మపాపము.

గు. జన్మపాపము మనుష్యులందరికి వచ్చినదా?

శి. అర్చశిష్ట కన్యమరియమ్మకుతప్ప అందరికి వచ్చినది.

గు. ఆపాపముచేత మన ఆది తల్లి దండ్రులకున్ను వారిసంతతియైన మనుష్యులందరికిన్ని వచ్చిన కీడు యేమి?

శి. పిశాచికిఅడిమెలై చావు నరకము మొదలైన శిక్షలకు పాత్రులై పోయినారు.

గు. సర్వేశ్వరుడు యిటువంటి అఘోరమైన స్థితిలో మనుష్యులను విడిచి పెట్టినారా?

శి. లేదు, కనికరపడి ఒక్క రక్షకుని పంపుతామని మన ఆదితల్లిదండ్రులకు వాగ్దత్తమిచ్చినారు.

గు. ఎందుకు ఆదిస్త్రీపురుషులను ఆది తల్లిదండ్రులనుచున్నాము?

శి. ఆయిద్దరి సంతతిమూలముగా మనుష్యులందరు పుట్టేటందుచేత.

గు. మనుష్యులు విస్తారమైనప్పుడు యేలాగుఅయి పోయినారు?

శి. దుర్మార్గులై నానావిధపాపముల నేరస్థులైపోయి నారు.

గు. అప్పుడు సర్వేశ్వరుడు వార్లను శిక్షించినదే లాగు?

శి. జలప్రళయముచేత శిక్షించినారు.

గు. అది సంభవించినదేలాగు?

శి. నలభై రాత్రింబగళ్లు భయంకరమైన వర్షము యెడతెగక కురిసినందువల్ల లోకమంతె ము నిగిపోయెను.

గు. ఆజలప్రళయములో మనుష్యులందరుచనిపోయి నారా?

శి. నోవహు అనేవాడున్ను తన కుటుంబమున్ను అంత యెనమండ్రుతప్ప మనుష్యులందరు చనిపోయినారు.

గు. ఆమైనమందున్ని యేలాగురక్షించబడినారు?

శి. నోహా అనేవాడు పుణ్యాత్ముడై యున్నందువల్ల సర్వేశ్వరుని కృపపొందించి వాడున్ను తన కుటుంబమున్ను మందసమనే ఒక నావలో రక్షించబడినారు.

గు. జలప్రళయము యెప్పుడు జరిగెను?

శి. లోకము సృష్టించబడిన వెయ్యాన్ని ఆరునూట యాభై ఆరో సంవత్సరములో జరిగెను.

గు. జలప్రళయమైన తరువాత నేమిసంభవించెను?

శి నోహాఅనేవాని కుటుంబమువల్ల మనుష్యులు మళ్లీ విస్తారమై సర్వలోకమందు వ్యాపించినారు.

గు జలప్రళయము తరువాత మనుష్యులు అధిక భక్తిగలవారై యుండినారా?

శి. లేదు, మునుపటి ప్రకారము దుర్మార్గులై సర్వేశ్వరుని మరచిపోయి విగ్రహములకు ఆరాధన చేసినారు

శి. అప్పుడు సర్వేశ్వరుడు యేమిచేసినారు?

గు. భూలోకమందు సత్యవేదముయొక్క తెలివి యును రావలసిన లోకరక్షకునిగురించి జ్ఞాపకమున్ను కాపాడేటందుకు యూదవారనే

ఒక జనము నేర్పర్చుకొని సాధారణమైనఅం
ధకార దుర్మార్గములోనుంచిరక్షించినారు?

గు. ఆజనముయొక్క తండ్రి యెవ్వరు?

శి. అబ్రహామనేవారు.

గు. యూదవారనే జనమును సర్వేశ్వరుడు నడిపిం
చిన దేలాగు?

శి. ఆజననిమిత్తము సర్వేశ్వరుడు అనేక అద్భుత
ములను చేసి వారిలోనుంచి లోకరక్షకుడు
పుట్టుతారని నానామార్లు వాగ్దత్తమిచ్చినా
రు. ఇదిగాక ఆజనమందు అనేకమంది మహా
పుణ్యాత్ములైన అర్చశిష్టవారై పోయినారు.
వీరిలో అనేక దీర్ఘదర్శులు సర్వేశ్వరుడు
తెలియచేసినప్రకారమే దివ్యపుస్తకములును
వ్రాసినారు. ఇటువంటిదీర్ఘదర్శులచేత సర్వే
శ్వరుడు లోకరక్షకుని పంపడముగురించి పూ
ర్వకాలమందు ఇచ్చినవాగ్దత్తము తిరిగి చేసి
ఆరక్షకునియొక్క ఆశ్చర్యజన్మమును గురిం
చిన్ని జీవమును గురించిన్ని అద్భుతములను
గురించిన్ని ఇవి మొదలైన జరగబోయే వ్రి
ధానవృత్తాంతములను గురించిన్ని మనుష్యు
లకు ముందుగా తెలియచేసినారు.

గు. ఆదివ్యవాగ్దత్తమైన లోకరక్షకుడు యెప్పుడు వేంచేసినారు?

శి. లోకము సృష్టించబడిన నాలుగువేల సంవత్సరములకు తరువాత వేంచేసినారు.

గు. ఆదివ్యలోకరక్షకుని పేరేమి?

శి. యేసుక్రీస్తు.

గు. ఆదివ్యరక్షకుని శిష్యులకు పేరేమి?

శి. క్రీస్తువులు.



# జ్ఞానోపదేశము.

మొదటిభాగము.

## సత్యవేదముయొక్క ప్రధాన పరమ రహస్యములను గురించి.

—— :o: ——

మొదటిపాఠము.

### స్లీవగురుతును గురించి.

గు. నీవు క్రీస్తుడవా?

శి. సర్వేశ్వరుని దయవల్ల క్రీస్తుడనే.

గు. నీవు క్రీస్తుడనైయున్నావని యేలాగు తెలుసును?

శి. స్లీవగురుతుచేత తెలియవచ్చును

గు. స్లీవగురుతు వేయుము?

శి. స్లీవగురుతు మంత్రము.................

గు. స్లీవగురుతు యెందుకు నొసటిమీద వేసుకొనుచున్నాము?

శి. చెడ్డతలంపుల నుంచి సర్వేశ్వరుడు మనలను రక్షించేటట్టుగా నొసటిమీద స్లీవగురుతు వేసుకొనుచున్నాము.

గు. నోటిమీద స్లీవగురుతు యెందుకు వేసుకొనుచున్నాము?

శి. చెడ్డమాటలనుంచి సర్వేశ్వరుడు మనలను రక్షించేటట్టుగా నోటిమీద స్లీవగురుతు వేసుకొనుచున్నాము.

గు. రొమ్ముమీద స్లీవగురుతు యెందుకు వేసుకొనుచున్నాము?

శి. హృదయములోనుంచి పుట్టిన చెడ్డ ఆశలనుంచి సర్వేశ్వరుడు మనలను రక్షించేటట్టుగా రొమ్ముమీద స్లీవగురుతు వేసుకొనుచున్నాము.

గు. నొసటిమీదనున్ను రొమ్ముమీదనున్ను యెడమభుజము మీదనున్ను కుడిభుజము మీదనున్ను యేకముగా స్లీవగురుతు యెందుకు వేసుకొనుచున్నాము?

శి. పిత, సుతుడు, స్పిరీతుసాంక్తు అనే అర్చిష్ట త్రీత్వముయొక్క ముగ్గిరి పేర్లు నుచ్చరించి యేకత్రిత్వసర్వేశ్వరుని దయపొందేటందుకున్ను జేసుక్రీస్తు మనలనురక్షించేటందుకు స్లీవమీద కొట్టబడి మరణము పొందినారని చూపించేటందుకున్ను యేకముగా స్లీవగురుతు వేసుకొనుచున్నాము.

గు. స్లీవగురుతు యెప్పుడు వేసుకొనవలెను?

శి. తరుచుగా వేసుకొనవలెను. విశేషముగా నిద్రపోవుటకు మునుపున్ను నిద్రలేచేటప్పుడున్ను

భోజనమునకు మునుపున్ను తర్వాతనున్ను యేదొక పని ఆరంభించేటప్పుడున్ను ముగించేటప్పుడున్ను ఇవి మొదలైన సమయముల యందు స్లీవగురుతు వేసుకోవలెను.

గు. అటువంటి సమయములయందు యెందుకు స్లీవగురుతు వేసుకొనవలెను?

శి. సర్వేశ్వరుడు మనశతుౄవులనుంచి యేయేచోటులోనున్ను యేయేసమయములోనున్ను మనలను రక్షించేటట్టుగా స్లీవగురుతు వేసుకొనుచున్నాము.

గు. మనశతుౄవులు యెవ్వరు?

శి. భూలోకము, శరీరము, పిశాచులు.



౨-వ పాఠము.

## సర్వేశ్వరుని గురించి.

---

గు. నిన్ను సృష్టించి భూలోకమందు ఉంచినవారు యెవ్వరు?

శి సర్వేశ్వరుడు.

గు. సర్వేశ్వరుడు యెందుకు నిన్ను సృష్టించినారు?

శి. భూలోకమందు వారిని తెలుసుకొని స్నేహించి కొలిచి పరలోకమందు వారితో కూడ నిత్యభాగ్యమును పొందేటందుకు సృష్టించినారు.

గు. సర్వేశ్వరుడనగా నెవ్వరు?

శి. సమస్తమును సృష్టించి యానత్తుకు కర్తయై మితిలేని యుత మజ్ఞాన స్వరూపియై యుండే వారే సర్వేశ్వరుడనబడుదురు.

గు. వీరియుత్తమ లక్షణములేవి?

శి. సర్వేశ్వరుడు తామైయున్నారు. అనాదిగా ఉన్నారు. శరీరములేకయున్నారు. కడగుదుతులేని సకలమేలుల స్వభావముగా ఉన్నారు. ఎందున్ను వ్యాపించియున్నారు. అంత

టికిన్ని ఆదికారణమైయున్నారు. ఇవి మొదలైన యింకలెక్క లేనిలక్షణములుగలవారై యున్నారు.

గు. మన అర్పశిష్టవేదములో ప్రధాన పరమరహస్యములెన్ని?

శి. మూడు. ఇవి యేవంటే, అర్పశిష్టత్రిత్వము యొక్క పరమరహస్యమున్ను, మనుష్యావతారముయొక్క పరమరహస్యమున్ను, రక్షణముయొక్క పరమరహస్యమున్ను.



3-వ పాఠము.

## త్రిత్వముయొక్క పరమరహస్యమును గురించి.



గు. త్రిత్వముయొక్క పరమరహస్యమనగానేమి?

శి. ఒక్కసర్వేశ్వరుడు ముగ్గురుగానుండడమే. అదేలాగంటే, పిత, సుతుడు, స్పిరితుసాంక్తు ముగ్గురైయున్నప్పటికిన్ని యీముగ్గురు ఒక్కసర్వేశ్వరుడై యున్నారు.

గు. పిత, సర్వేశ్వరుడా?

శి. సర్వేశ్వరుడు.

గు. సుతుడు, సర్వేశ్వరుడా?

శి. సర్వేశ్వరుడు.

గు. స్పిరీతుసాంక్తు, సర్వేశ్వరుడా?

శి. సర్వేశ్వరుడు.

గు. కాబట్టి ముగ్గురు సర్వేశ్వరులా, ఒక్కేసర్వేశ్వరుడా?

శి. ఒక్కేసర్వేశ్వరుడు.

గు. ఎందుచేత ఒక్కేశర్వేశ్వరుడు?

శి. ఈముగ్గురికిన్ని యొక్కేబుద్ధి, యొక్కేబలము, ఒక్కేజ్ఞానము, ఒక్కేదేవస్వభావము కలిగియున్నందుచేత ఈముగ్గురు ఒక్కేసర్వేశ్వరుడై యున్నారు.

గు. వీరిలో పెద్దవారున్ను, చిన్నవారున్ను, గలరా?

శి. లేరు.

గు. ఎందుచేత లేరు?

శి. పిత అనాది, సుతుడు అనాది, స్పిరీతు సాంక్తు అనాది, ముగ్గురున్ను అనాదియైయున్నారు గనుక వీరిలో పెద్దవారున్ను చిన్న వారున్ను లేరు.

---

## ౪-వ పాఠము.

## మనుష్యావతారముయొక్క పరమరహస్యమును గురించి.

గు. త్రిత్వముయొక్క ముగ్గురిలో మనుష్యులు చేసిన పాపములకొరకు మనిషియై పుట్టినవారెవ్వరు?

శి. రెండవవారైన సుతుడైన సర్వేశ్వరుడు.

గు. ఎవ్వరినుంచి మనిషియై పుట్టినారు?

శి. అర్చశిష్ట కన్య మరియమ్మనుంచి పుట్టినారు.

గు. వారేలాగున యీ కన్య స్త్రీనుంచి పుట్టినారు?

శి. తక్కినవారి ప్రకారముగా పుట్టక స్పిరీతు సాంక్తువల్ల గర్భమై యుద్భవించి కన్యాత్వము మహిమ చెడని యీకన్యస్త్రీనుంచి పుట్టినారు.

గు. స్వామిపుట్టిన ఎనిమిదవ రోజున వారికి యేమి పేరు పెట్టినారు?

శి. జేసుననే పేరు పెట్టినారు.

గు. జేసుననే పేరుకు అర్థమేమి?

శి. మనలను రక్షించేవారని యర్థమవును.

గు. క్రీస్తుననే పేరుకు అర్థమేమి?

శి. దైవ అభిషేకముపొంది నిజమైన సర్వేశ్వరుడున్ను నిజమైన మనుష్యుడున్ను ఒకటిగా నున్నారని అర్థమవును.

గు. జేసునాథునికి యెన్ని స్వభావములు గలవు?

శి. దేవస్వభావమున్ను మనుష్యస్వభావమున్ను రెండుస్వభావములు గలవు.

గు. జేసునాథునియందు ఎంతమందియున్నారు?

శి. ఒక్కరుమాత్రమే.

గు. జేసునాథునికి తండ్రియున్నారా?

శి. జేసునాథుడు సర్వేశ్వరుడై యున్నందున వారికి పితయైన సర్వేశ్వరుడు తండ్రియై యున్నారు: తల్లి లేదు. మనుష్యుడైయున్నందున వారు స్పిరీతు సాంక్తునల్ల గర్భమై యుద్భవించి పుట్టినందుచేత తండ్రిలేదు. తల్లిమాత్రమున్నది.

గు మనుష్యుడై యున్నందున అర్చిష్ఠ జోజప్పగారు వారికి తండ్రికారా?

శి. కాదు. వారికి పెంచినదాతగా మాత్రమే యుండిరి.

గు. జేసునాథస్వామి యీలోకమందెన్ని సంవత్సరములుండినారు?

శి. ముప్పైమూడు సంవత్సరములుండినారు.

గు. ఈముప్పైమూడు సంవత్సరములలో నేమిచే
సినారు?

శి. సకలపుణ్యములను అద్భుతములను చేసి తమ
దివ్యవేదము తెలియచేసి అపోస్తులనేర్పరచి
నారు.

---

౫-వ పాఠము.

## రక్షణముయొక్క పరమ రహస్యమును గురించి.

---

గు. జేసుక్రీస్తునాథుడు పాటుపడినారా?

శి. పాటుపడినారు.

గు. జేసుక్రీస్తునాథుడు దేవస్వభావమందు పాటు
పడినారా?

శి. దేవస్వభావమందు కష్టపడరాదు, మరణము
పొందరాదు గనుక మనుష్య స్వభావమందు
మాత్రము పాటుపడినారు.

గు. ఎవ్వరికొరకు పాటుపడినారు?

శి. మనకొరకు పాటుపడినారు.

గు. మనమేమిచేసినాము?

శి. సర్వేశ్వరునికి ద్రోహమైనపాపము చేసినాము.

గు. పాపముచేత మనకువచ్చిన ఆజ్ఞేమి?

శి. పాపముచేత మనము సర్వేశ్వరునికి శత్రువుల
మై నరకానికి పాత్రులమైపోయినాము.

గు. జేసునాథుడు మనపాపమునిమిత్తముఏమిపాటు
పడినారు?

శి. లెక్కలేని కష్టములను అనుభవించి స్లీవయందు
కొట్టబడి కఠినమైన మరణముపొంది సమాధి
లో స్థాపించబడినారు.

౬-వ పాఠము.

మనిషియొక్క కడగతులనుగురించి.

గు. మనిషియొక్క కడగతులెన్ని?

శి. నాలుగు. అవియేవియంటే చావు, తీర్పు, నరక
ము, మోక్షము

గు. చావు అనగానేమి?

శి. ఆత్మ శరీరమును వదలివేసి వేరుబోవడమే చా
వు అనబడును.

గు. మనమందరము చచ్చిపోదుమా?

శి. అవును. ఒక్కడైనను తప్పకుండ అందరము
చచ్చిపోదుము

గు. మనమెప్పుడు చచ్చిపోదుము?

శి. మనకు తెలియదు. సర్వేశ్వరునికి యిష్టమైనప్పుడు చచ్చిపోదుము, కాబట్టి మంచికీ్రస్తువులుగా నడచి యెల్లప్పుడు చావుకు ఆయత్తము చేయవలెను.

గు. మనము చచ్చిపోగానే మనఆత్మ యేమిఅవును?

శి. మనముచేసిన మేలు కీళ్ల లెక్క చెప్పుటకు సర్వేశ్వరుని సన్నిధికి వెళ్లును.

గు. మనశరీర మేమి అవును?

శి. సమాధిలో స్థాపించబడి చెడిపోవును.

గు. మనశరీరము ఎప్పుడున్ను సమాధిలోనుండునా?

శి. ఉండదు. లోకముగింపున సర్వేశ్వరుని సర్వశక్తివల్ల లేచును.

గు. లోకముగింపున మనశరీర మెందుకు జీవంతులై లేచును?

శి. మనము ఈలోకమందు ఉండేటప్పుడుమేలుకీడు చేయుటకు ఆత్మయున్ను శరీరమున్ను ఒకటిగా ప్రయాసపడినందున సాధారణ తీర్పుదినమందు ఆత్మకువచ్చే బహుమానములోనైనను శిక్షలోనైనను పాలుపొందేటందుకు జీవంతులై లేచును.

## కడాపట తీర్పును గురించి.

గు. కడాపట తీర్పు అనగా నేమి?

శి. సర్వేశ్వరుడు వాడు వాడు చేసిన మేలుకీళ్లకు తగినట్టుగా వానివానికి బహుమానమైనను శిక్షైనను కట్టడ చేయడమే కడాపట తీర్పు అనబడును.

గు. ఎన్నివిధములైన తీర్పులు గలవు?

శి. ఏకాంతమైన తీర్పున్ను సాధారణతీర్పున్ను అనే రెండువిధములైన తీర్పులుగలవు.

గు. ఏకాంతమైన తీర్పు అనగా నేమి?

శి. వాడు వాడు మరణము పొందిన తక్షణమే వాని వానికి ఏకాంతముగా సర్వేశ్వరుడు ఇచ్చే తీర్పు ఏకాంతమైన తీర్పు అనబడును.

గు. ఏకాంతమైనతీర్పుఇవ్వబడగానేఆత్మ యెక్కడికి వెళ్లును?

శి. చేసినమేలుకీళ్లకు తగినట్టుగా మోక్షానికైనను నరకానికైనను ఉత్తరించే స్థలానికైనను వెళ్లును.

గు. సాధారణ తీర్పుఅనగా నేమి?

శి. లోకముగింపున సర్వేశ్వరుడు సకల మనుష్యు

లకు ప్రసిద్ధముగా చేయబోయేతీర్పు సాధారణతీర్పు అనబడును.

## మోక్షమునుగురించి.

గు. మోక్షమనగా నేమి?

శి. నమ్మనస్సులున్ను అర్పశిష్టవారలున్ను సర్వేశ్వరుని ముఖాముఖిగా చూచి నిత్యముగా నేమి తక్కువ లేకుండ సకలభాగ్యములను అనుభవించే చోటు మోక్షమనబడును.

గు. మోక్షమునకు వెళ్లేవారెవ్వరు?

శి. దేవయిష్టప్రసాదముతో మరణము పొందేవారలు.

## నరకమును గురించి.

గు. నరకమనగా నేమి?

శి. పిశాచులున్ను మనస్సు తిరగక చచ్చిపోయిన పాపాత్ములున్ను ముగింపులేని సకల వేదనలను అనుభవించుటకు దేవనీతివల్ల నియమించబడిన స్థానమే నరకమనబడును.

గు. నరకమునకు వెళ్లేవారెవ్వరు?

శి. చావైనపాపముతో చచ్చిపోయినవారలు.

గు. ఉత్తరించే స్థలమనగానేమి?

శి. పుణ్యాత్ములు మోక్షమునకు వెళ్లకమునుపు అనిత్యశిక్షలమూలముగా తమతప్పులను విమోచనము చేయుటకు నియమించబడిన చోటు ఉత్తరించే స్థలమనబడును.

గు. ఉత్తరించే స్థలమునకు వెళ్లేవారెవ్వరు?

శి. తమ అల్పతప్పులను గురించియైనను ఓర్వబడిన చావైన పాపములను గురించియైనను కావలసినచోప్పున ఉత్తరించక దేవ యిష్టప్రసాదముతో మరణముపొందువారలు ఉత్తరించే స్థలమునకు వెళ్లుదురు.



రెండవ భాగము.

# మోక్షభాగ్యము పొందేటందుకు విశ్వసించవలసిన సత్యములను గురించి.

మొదటిపాఠము.

## మన విశ్వాసముయొక్క ఆధారమును గురించి.

---

గు. ఎవ్వరు మనలను సృష్టించినారు?

శి. సర్వేశ్వరుడు.

గు. ఎందుకు మనము సృష్టించబడినాము?

శి సర్వేశ్వరుని తెలుసుకొనేటందుకున్ను స్నేహించేటందుకున్ను సేవించేటందుకున్ను అందువల్ల మోక్షభాగ్యము పొందేటందుకున్ను సృష్టించబడినాము.

గు. సర్వేశ్వరుని తెలుసుకొనే దేలాగు?

శి. సర్వేశ్వరుడు తెలియచేసిన సత్యములను తెలుసుకొని విశ్వసించేటందువల్లనే.

గు. సర్వేశ్వరుని స్నేహించే దేలాగు?

శి. సకలవస్తువులకన్న సర్వేశ్వరునియందు అధికప్రియము ఆశ భక్తియుంచేటందువల్లనే.

గు. సర్వేశ్వరుని సేవించే దేలాగు?

శి సర్వేశ్వరుడు మనకానతిచ్చిన వేదకల్పనలను అనుసరించేటందువల్లనే.

గు. సర్వేశ్వరుడు వేదసత్యములను ఏలాగు తెలియజేసినారు?

శి. పూర్వకాలమందు దీర్ఘదర్శులచేతనున్ను తరువాత జేసునాథస్వామిచేతనున్ను తెలియచేసినారు.

గు. దీర్ఘదర్శులనగా నెవ్వరు?

శి. రాబోయేకాలమందు జరిగే వృత్తాంతములను ఎరిగి ముందుగా చెప్పేవారే దీర్ఘదర్శులనబడుదురు.

గు. దీర్ఘదర్శులకు బోధించిన వారెవ్వరు?

శి. సర్వేశ్వరుడే.

గు. దీర్ఘదర్శులతో సర్వేశ్వరుడు సంభాషించ నవధరించినారని యేలాగు నిజపరచినారు?

శి అద్భుతములను చేసినందువల్లనే.

గు. అద్భుతమనగా నేమి?

శి. ప్రపంచపుస్థితికి విరుద్ధమై మనుష్యశక్తికి మీరించిన క్రియ అద్భుతమవును. ఉదాహరణ: చనిపోయినవారికి మళ్లీ జీవమివ్వడము ఒక్క

మాట చెప్పినందువల్ల కాయిలావానిని స్వస్థముగా జేయడము ఇత్యాదులు.

గు. అద్భుతము సత్యమునకు దృష్టాంతమయ్యేదేలాగు?

శి. సర్వేశ్వరుని శక్తిచేతనే అద్భుతము చేయవచ్చును. అయితే సర్వేశ్వరుడు అబద్ధమునకుకారకుడై ఇటువంటిశక్తి ఇవ్వరాదు గనుక అద్భుతము సత్యమునకు దృష్టాంతమే.

గు. జేసునాథస్వామిచేత వేదసత్యములు బయలుపరచబడినదేలాగు?

శి. జేసునాథస్వామి యీలోకమందు వేంచేసి మనుష్యులలో ప్రసంగించి సంభాషించి నేను లోకరక్షకుడనున్ను సర్వేశ్వరుడనున్ను అని తమ దివ్యనడతచేతనున్ను తమ్మునుగురించిదీర్ఘదర్శనములు నెరవేర్చబడినందువల్లనున్ను అనేక అద్భుతములను చేసినందువల్లనున్ను సిజపరచినారు గనుక జేసునాథస్వామి యుపదేశము దేవ యుపదేశమే.

గు. దీర్ఘదర్శులున్ను జేసునాథస్వామియును ఉపదేశించిన వేదసత్యములు మనకు తెలియవచ్చేదేలాగు?

శి. దివ్యపుస్తకములవల్లనున్ను ఐతిహ్యమువల్లనున్ను తెలియవచ్చును.

గు. దివ్యపుస్తకములనగా నేమి?

శి. సర్వేశ్వరుని ఆజ్ఞచేతనున్ను సర్వేశ్వరుడు తెలియచేసిన ప్రకారముగానున్ను దీర్ఘదర్శులు అపోస్తులుమొదలైన మహాపుణ్యాత్ములు వ్రాసిన గ్రంథములు దివ్యపుస్తకములవును.

గు. ఐతిహ్యామనగా నేమి?

శి. దివ్యపుస్తకములలో వ్రాయబడక తల్లిదండ్రులనుంచి బిడ్డలకు పారంపర్యముగా వచ్చిన వేదసత్యములు ఐతిహ్యామవును.

గు. దివ్యపుస్తకములనున్ను వేద ఐతిహ్యామునున్ను కాపాడి వివరించి యుపదేశించే దెవ్వరు?

శి. జేసునాథస్వామిస్థాపించిన తిరుసభ అవియన్ని పొరపాటులేకుండ కాపాడి వివరించి యుపదేశించుచున్నది.

గు. తిరుసభ వేదసత్యములను పొరబాటులేకుండ యుపదేశించేదనేటందుకు దృష్టాంతమేమి?

శి. జేసునాథస్వామి తమ అపోస్తలతోనున్ను వార్లకు బదులుగానుండే అర్చ్ఛిష్టుఅబ్బగారగు పాపుగారితోనున్ను ఇతనితో ఐక్యముగానుండే మేత్రాణులతోనున్ను మీమాటవినేవాడు నామాటే వినుచున్నాడనిన్ని ఇదుగో లోకాంతపర్యంతమేవేళ నేను మీతో

కూడ యున్నానని న్ని చెప్పినందువల్ల వేద సత్యములను పొరబాటు లేకుండ యుపదేశించేటట్టుగా తమ తిరుసభకు సాహాయ్యముచేసి స్వతంత్రమివ్వ నవధరించినారు.

గు. కాబట్టి నీవు ఒప్పుకొనే వేదము నీకెవ్వరు నేర్పించినారు?

శి. మాగురువు నేర్పించినారు.

గు. మీగురువు ఉపదేశమెందుకు నమ్ముకొను చున్నావు?

శి. మాగురువు అర్చశిష్ట అబ్బాగారగు పాపుగారితో నైక్యముగానుండే మామేత్రాణులవారిచేత నియమించబడినందువల్ల మాగురువు నేర్పించే ఉపదేశము తిరుసభ యుపదేశమే.

గు. తిరుసభ యుపదేశమెందుకునమ్ముకొనుచున్నావు?

శి. జేసునాథస్వామి సాహాయ్యముపొంది తిరుసభ లోకాంతపర్యంతము పొరబాటు లేకుండ సత్యవేదము ఉపదేశించేటందువల్ల తిరుసభ యుపదేశము జేసునాథస్వామియొక్క యుపదేశమే.

గు. జేసునాథస్వామియొక్క యుపదేశము ఎందుకు నమ్ముకొనుచున్నావు?

శి. జేసునాథస్వామి లోకరక్షకుడున్నై నిజముగా సర్వేశ్వరుడున్నై ఉన్నందుచేతనే.

గు. సర్వేశ్వరుని వాక్యమెందుకు నమ్ముకొనుచున్నావు?

శి. సర్వేశ్వరుడు సత్యస్వరూపిగా నుండేటందువల్ల అతని వాక్యము రూఢిగా సత్యమే.

గు. కాబట్టి నీవిశ్వాసము ఊర్జితముగా నుండునా?

శి. సర్వేశ్వరునియొక్క అధికారముమీద నిలిచినందున ఊర్జితమే.

## ౨వ- పాఠము.

### విశ్వాసమంత్రమును గురించి.

గు. మోక్షభాగ్యము పొందుటకేమి చేయవలసినది?

శి. ౧-ది, సర్వేశ్వరుడు తెలియచేసిన సత్యములన్ని విశ్వసించవలసినది. ౨-ది. సర్వేశ్వరుడానతిచ్చిన కల్పనలన్ని అనుసరించవలసినది.

గు. సర్వేశ్వరుడు తెలియచేసిన సత్యములను సాధారణముగా విశ్వసించేది చాలునా?

శి. చాలదు. కొన్ని వేదసత్యములను నేర్చుకొని వివరముగా విశ్వసించవలసినది.

గు. వివరముగా నేర్చుకోవలసిన వేదసత్యము లెన్ని విధములుగా నున్నవి?

శి. రెండువిధములుగా నున్నవి.

గు. మొదటివిధ సత్యములేవి?

శి. ౧-ది. ఒక్కసర్వేశ్వరుడు ఉండడము. ౨-ది. సర్వేశ్వరుడు పుణ్యాత్ములకు నిత్యబహుమానమున్ను పాపాత్ములకు నిత్యశిక్షయున్ను యివ్వడము. 3-ది. అర్చిశిష్ట త్రిత్వముయొక్క పరమరహస్యము. ర-ది. మనుష్యావతారముయొక్క పరమరహస్యము. ౫-ది. రక్షణముయొక్క పరమరహస్యము. ఈ అయిదు సత్యములు బుద్ధియెరిగినవారందరికి అగత్యముగా తెలియవలసినది. రెండు మొదటి సత్యములు విశేషముగా తెలియకపోతే మోక్షముపొందకూడదనునది సందేహము లేదు.

గు. రెండవవిధసత్యము లేవి?

శి. ౧-ది. విశ్వాసమంత్రములో ఇమిడియుండే ప్రధానసత్యములు. ౨-ది. జ్యోతిశ్చక్రమంత్రములో ఇమిడియుండే బోధన. 3-ది. సర్వేశ్వరునియొక్క కల్పనలున్ను తిరుసభ యొ

క్కకట్టడలున్ను యిమిడే ఆజ్ఞలు. ౮-డి. తానుపొందిన దేవద్రవ్య అనుమానములున్ను, పొందుటకు కావలసిన దేవద్రవ్యఅనుమానములున్ను. ౯-డి. తనస్థితి ఋణములు ఈఅయిదు కార్యములు వివరముగా తన అశ్రద్ధవల్ల తెలియకపోతే చావైనపాపమే.

గు. తక్కిన దేవసత్యములను నేర్చుకోవడము ఋణమా?

శి. తక్కిన సత్యములన్ని సర్వేశ్వరుడు తిరుసభకు ఆనతిచ్చినదంత విశ్వసించేదని సాధారణముగా విశ్వసించడము చాలును.

గు. సర్వేశ్వరుడు బయలు పరచిన ప్రధానసత్యములను ఇముడ్చే మంత్రమేది?

శి. విశ్వాసమంత్రము.

గు. విశ్వాసమంత్రమనగా నేమి?

శి. సర్వేశ్వరుని చేత ఆనతివ్వబడి అపోస్తులవారి చేత బోధించబడిన ప్రధానవిశ్వాస సత్యముల సంగ్రహము విశ్వాసమంత్రమనబడును.

గు. విశ్వాసమంత్రము ఎవ్వరు కలుగ జేసినారు?

శి. అపోస్తలవారే యీమంత్రము కలుగజేసినారు.

గు. విశ్వాసమంత్రములో నిమిడియుండే సత్యములన్ని తెలుసుకొని విశ్వసించవలెనా?

శి. అవును. ఈసత్యములన్ని తెలుసుకొని దృఢముగా విశ్వసించవలసినదే.

గు. విశ్వాసమంత్రము చెప్పు?

శి. జ్యోతిశ్చక్రమున్ను భూలోకమున్ను సృష్టించిన...ఇత్యాది.

గు. ఈ విశ్వాసమంత్రము ఎన్నిపర్వములుగా నున్నది?

శి. పండ్రెండు పర్వములుగా నున్నది.

---

## మొదటి పర్వము.

---

### సర్వేశ్వరుని గురించిన్ని లోకసృష్టిని గురించిన్ని.

గు. విశ్వాసమంత్రముయొక్క మొదటి పర్వము చెప్పు?

శి. జ్యోతిశ్చక్రమున్ను భూలోకమున్ను సృష్టించిన సర్వవల్లభుఁడైన పితయైన సర్వేశ్వరుని అంతఃసౌభాగ్యభక్తిచేత విశ్వసిస్తున్నాను.

గు. సర్వేశ్వరుడనగా నెవ్వరు?

శి. సమస్తమును సృష్టించి యావత్తుకు కర్తలై మితిలేని యుత్తమ జ్ఞానస్వరూపియై యుండేవారే సర్వేశ్వరు డనబడుదురు.

గు. ఎందరు సర్వేశ్వరులు?

శి. ఒక్కే సర్వేశ్వరుడుగాక అనేక సర్వేశ్వరు లుండకూడదు.

గు. ఎందుకు అనేకసర్వేశ్వరులు ఉండకూడదు?

శి. సర్వేశ్వరునికి సర్వకర్తృత్వము కలిగియుండే టందువల్ల అతనితో సమమైనవాడు ఉండ కూడదని సందేహములేదు.

గు. సర్వేశ్వరునియందు ఎంతమందియున్నారు?

శి. ముగ్గురు ఉన్నారు.

గు. ఈ ముగ్గురికి పేర్లేవి?

శి. పిత, సుతుడు, స్పిరీతుసాంక్తు.

గు పిత అనేటందుకు అర్థమేమి?

శి. తండ్రి.

గు. సుతుడు అనేటందుకు అర్థమేమి?

శి. కుమారుడు.

గు. స్పిరీతుసాంక్తు అనేటందుకు అర్థమేమి?

శి. దేవస్నేహమైయుండే మూడోవారైన సర్వే శ్వరుడు.

గు. పిత సర్వేశ్వరుడా?

శి. సర్వేశ్వరుడు.

గు. స తుకు సర్వేశ్వరుడా?

శి. సర్వేశ్వరుడు.

గు. స్పిరీతుసాంక్తు సర్వేశ్వరుడా?

శి. సర్వేశ్వరుడు

గు. ఈముగ్గురు ముగ్గురుసర్వేశ్వరులా, ఒక్క సర్వేశ్వరుడా?

శి. ఈముగ్గురు ఒక్కే సర్వేశ్వరుడు.

గు. ఏలాగు ఒక్కే సర్వేశ్వరుడు?

శి. ఈముగ్గురికి ఒక్కే జ్ఞానము, ఒక్కే. చిత్తము, ఒక్కే బలము, ఒక్కే దేవస్వభావము కలిగియుండేటందువల్ల ముగ్గురున్ను ఒక్కే సర్వేశ్వరుడు.

గు. ఈముగ్గురిలో బలము మహిమ మొదలైనలక్షణములలో వ్యత్యాసమున్నదా?

శి. లేదు. ఈముగ్గురు అన్నిటిలో సరిసమానమైయున్నారు.

గు ఈలాగు ఏకమున్ను త్రిత్వమున్నై యుండే సర్వేశ్వరునికి ప్రధానలక్షణము లెన్ని?

శి. ఆరు.

గు. ఆరు దేవలక్షణములు చెప్పు?

శి. మొదటిది. సర్వేశ్వరుడు తామై యున్నారు,
...ఇత్యాది.

గు. సర్వేశ్వరుడు తామై యున్నారనే టందుకు అర్థమేమి?

శి. సర్వేశ్వరుడు ఎవ్వరిచేత సృష్టించబడక తమయందు తామైయున్నారని అర్థమవును.

గు. అనాదిగా ఉన్నారనేటందుకు అర్థమేమి?

శి. వారికి మొదలు లేదు. మరిన్ని వారికి ముగింపు లేదు ఎల్లప్పుడు ఉండినారు. ఎల్లప్పుడు ఉందురని అర్థమవును.

గు. శరీరము లేక ఉన్నారనేటందుకు అర్థమేమి?

శి. పంచేంద్రియములకు అందని జ్ఞాన స్వరూపియై యున్నారని అర్థమవును.

గు. కడగురుతులేని సకలమేలుల స్వభావముగానున్నారనేటందుకు అర్థమేమి?

శి. వారు మితిలేని నీతి, మితిలేని దయ, మితిలేని జ్ఞానము, మితిలేని మహిమ, మితిలేని శక్తిన సకల మేలుల స్వభావముగానున్నారని అర్థమవును.

గు. ఎంతన్ను వ్యాపించి యున్నారనేటందుకు అర్థమేమి?

శి. సర్వేశ్వరుడు పరలోకములోనున్ను భూలోకములోనున్ను తక్కిన యేస్థలములోనున్ను ఉండగా అంత చూస్తు తెలుసుకొంటు కాపాడుచు యేలుచు ఉన్నారని అర్థమవును.

గు. సర్వేశ్వరుడు అంతటికిన్ని ఆదికారణమైయుండే దేలాగు?

శి. సర్వేశ్వరుడు పరలోకమున్ను భూలోకమున్ను వాటిలో నిమిడియుండేదంతానున్ను సృష్టించి కాపాడుతు ఉండేటందువల్ల అంతటికిన్ని ఆదికారణమై యున్నారు.

గు. అటువంటి దేవలక్షణములు ఈదేశమందు ఆరాధించబడే దేవ్రులకు కలిగియున్నవా?

శి. లేవు. వార్లకు మొదలున్ను ముగింపున్ను సకలదుర్గుణములున్ను కొరతలున్ను కలిగియున్నందువల్ల వారలకు దేవలక్షణములు లేవు. దైవగురుతులు లేవు. వారలు దేవుండ్లుకారే. కాబట్టి అటువంటి వస్తువులను స్తుతించేవారు మహాగొప్ప పాపము చేసేవారే.

---

## మొదటిపర్వము వివరించుట.



గు. సర్వేశ్వరుడు జ్యోతిశ్చక్రమున్ను భూలోకమున్ను సృష్టించినవారై యున్నారని చెప్పేదెందుకు?

శి. సర్వేశ్వరుడు ఏమి లేమినుంచి పరలోకమున్ను భూలోకమున్ను వాటిలో నిమిడియుండే సమస్తమున్ను సృష్టించినందుచేతనే.

గు. సర్వేశ్వరుడు సర్వవల్లభులైనవారై యున్నారని చెప్పేదెందుకు?

శి. సర్వేశ్వరునివల్ల కూడనిదియేమి లేనందుచేతనే.

గు. సుతుడున్ను స్పిరీతుసాంక్తున్ను పితవలెనే సర్వవల్లభులైనవారై యున్నారా?

శి. అవును. సుతుడున్ను స్పిరీతుసాంక్తున్ను పితతోకూడ ఒక్కే సర్వేశ్వరుడై యున్నారు గనుక అతనివలెనే సర్వవల్లభులైనవారై యున్నారు.

గు. పితయైన సర్వేశ్వరుడని చెప్పేదెందుకు?

శి. త్రిత్వముయొక్క మొదటివారైన పితయైన సర్వేశ్వరుడు తమతో అన్నిటిలో సరిసమానమైయుండే రెండవవారైన సుతుని నిత్య

ముగా తమయందు కనినందువల్ల పితయని చెప్పుచున్నాము.

గు. సర్వేశ్వరుని అంతః యోగ్యభక్తి చేత విశ్వసిస్తున్నాననేటందుకు అర్థమేమి?

శి. ఒకే సర్వేశ్వరుడు ఉన్నారనిన్ని వీరు త్రిత్వం తులై యున్నారనిన్ని వీరు ఆనతిచ్చినదంత నిజమైయున్నదనిన్ని మనము దృఢముగా విశ్వసించేదిగాకుండ వీరినినమ్మి స్నేహించి యున్నామని అర్థమవును.

గు. సర్వేశ్వరుడు సృష్టించిన వస్తువులలో ఉత్తమ వస్తువులేవి?

శి. సమ్మనస్సులున్ను మనుష్యులున్ను.

గు. సృష్టించబడిన సకలవస్తువులకంటె సమ్మనస్సులున్ను మనుష్యులున్ను ఉత్తమవస్తువులని చెప్పుటకు హేతువేమి?

శి. సమ్మనస్సులున్ను మనుష్యులున్ను మాత్రము సర్వేశ్వరుని తెలుసుకొనుటకున్ను స్నేహించుటకున్ను సన్మానించుటకున్ను తగినవస్తువులై యున్నందుచేతనే.

గు. సమ్మనస్సులనగా నెవరు?

శి సర్వేశ్వరుని సన్నిధిలోనుండి వారి ఆజ్ఞలను నెరవేర్చుటకు సృష్టించబడిన జ్ఞానస్వరూపులు సమ్మనస్సులనబడుదురు.

గు. సర్వేశ్వరుడు సమ్మనస్సులను ఏస్థితిలో సృష్టించిరి?

శి. పరిశుద్ధమయిన స్థితిలో సృష్టించిరి.

గు. సమ్మనస్సులందరు ఈపరిశుద్ధమయిన స్థితిలో నిలకడగా నుండినారా?

శి. వారిలో కొందరు నిలకడగానుండినారు, కొందరు తమ అహంకారముచేత చెడిపోయి పరమండలములోనుంచి త్రోయబడి నరకమందు బడినారు.

గు. దేవయిష్టములో నిలిచినవారికి పేరేమి?

శి. సమ్మనస్సులు.

గు. మనయొద్ద వారికి యేదయిన ఉద్యోగమున్నదా?

శి. ఉన్నది. వారిలో అనేకమందిని సర్వేశ్వరుడు మనకు కావలివారుగా స్థాపించియున్నారు.

గు. కావలివారయిన సమ్మనస్సులు మనకు సహాయమునకై చేసేదేమి?

జ. ౧-ది. మనకొరకు సర్వేశ్వరుని వేడుకొనుచు న్నారు.

౨-ది మనముచేసిన పుణ్యక్రియలను వారికి కానుకగా సమర్పించుచున్నారు.

3-ది. మనము పిశాచములతంత్రములలో అగపడకపోయేట్టుగా సహాయము చేయుచున్నారు.

౪-ది. మనముకష్టక్లేశములలో నుండేటప్పుడు మనకు ఆదరణ రప్పించుచున్నారు.

గు. మనకావలివారయిన సన్మనస్సులకు మనము చేయతగిన దేమి?

జ. వారిని సన్మానించి వారిమీద మనసమ్మిక యుంచి మన అవసరములలో వారిని వేడుకోవలెను.

గు. అహంకారముచేత చెడిపోయిన సన్మనస్సులకు పేరేమి?

జ. పిశాచులు.

గు. పిశాచులు ఏమిచేయుచున్నవి?

జ. అవిఅహంకారముచేత పోగొట్టుకొని నభాగ్యము మనుష్యులకు దొరుకుచున్నదని మత్సరముచేత మనము పాపము చేసి వాటివలెనే చె

డిపోయి నరకములో పడేటట్టుగా మనకు తంత్రము చేయుచున్నవి.

గు. పిశాచులు చేయుతంత్రముల నేలాగునజయించి తోసివేయవలెను?

శి. తపస్సుచేతనున్ను జపముచేతనున్ను ఒక్కొక్క ప్పుడు పాపసంకీర్తనముచేసి సత్ప్రసాదము పొందుటచేతనున్ను యిటువంటి తంత్రము లను జయించి తోసివేయవలెను.

గు. సర్వేశ్వరుడు సృష్టించిన మొదటి మనిషిన్ని మొదటి ఆడమనిషిన్ని యెవరు?

శి. మన ఆది తలిదండ్రులయిన ఆదమునేవాడున్ను హేవ అనే ఆమెయున్ను.

గు. ఆదము హేవ అనేవారలను మన ఆదితలిదం డ్రులనడమెందుకు?

శి. వారలసంతతిమూలముగా మనుష్యులందరు కలి గేటందుచేతనే

గు. సర్వేశ్వరుడు ఆదమునేవాని నేలాగున సృష్టిం

శి. సర్వేశ్వరుడు వాని శరీరము మంటితోచేసి త మపోలికగానుండే ఆత్మను సృష్టించి దీనిని శరీరముతో కలిపివేసిరి.

గు. సర్వేశ్వరుడు హేవ అనే ఆమె నేలాగున సృష్టించిరి?

శి. ఆదమనేవానికి నిద్రించ్పించి వీని పక్క యెముకలలో నొక్కటి తీసుకొని దీనితో హేవ అనే ఆమె శరీరము చేసి తమపోలికగానుండే ఆత్మను సృష్టించి ఈశరీరముతో కలిపివేసిరి.

గు. సర్వేశ్వరుడు ఆదమునున్ను హేవనున్ను యే స్థితితో సృష్టించినారు?

శి. వారలను పరిశుద్ధస్థితిలో సృష్టించినారు.

గు. సర్వేశ్వరుడు వారలను సృష్టించి యెక్కడ ఉంచినారు?

శి. భూలోకమోక్షమయిన శృంగారతోటలోనుంచినారు.

గు. ఆదమున్ను హేవయున్ను చిరకాలము శృంగారతోటలో నిలిచినారా?

శి. లేదు. కొంచెములో సర్వేశ్వరునికి లోబడకపోయినందువల్ల తమ పరిశుద్ధస్థితిని పోగొట్టుకొని శృంగార తోటలో నుంచి తోసివేయబడినారు.

గు: దేనిచేత సర్వేశ్వరునికి లోబడకపోయినారు?

శి. పిశాచి దుర్బోధనవమ్మి సర్వేశ్వరుడు నిషేధించిన చెట్టుపండు తిన్నందుచేతనే.

గు. మన ఆది తలిదండ్రులు సర్వేశ్వరుని ఆజ్ఞమీఱి చేసిన పాపమునిమిత్తము సంభవించిన దేమి?

శి. వారున్ను తమ సంతతివారైన మనుష్యులందరున్ను దేవయిష్టప్రసాదమున్ను చావకఉండడమనే వరమున్ను తమ సద్గుణములున్ను పోగొట్టుకొనినదిగాక నరకశిక్షకు పాత్రులై సకలదౌర్భాగ్యములకున్ను చావుకున్ను అస్వాలై పోయినారు.

గు. మన ఆదితలిదండ్రులు చేసిన పాపమునకు మనుష్యులందరు నేరస్థులైపోయినారా?

శి. అవును. వారు యిద్దరిలో సకల మనుష్యులు ఇమిడియుండినందుచేత అందరు నేరస్థులైపోయినారు.

గు. ఆలాగైనందువల్ల మనుష్యులందరు నిత్యశిక్షకు పాత్రులై పుట్టుచున్నారా?

శి. అవును. జన్మపాపమునకు నేరస్థులై పుట్టుచున్నందుచేతనే.

గు. సర్వేశ్వరుడు మనుష్యులను పాపములోనే విడిచిపెట్టినారా?

శి. లేదు. పాపములోనుంచి మనుష్యులను రక్షించుటకు తమ దివ్యకుమారుని యీలోకమునకు పంపించి మనిషిగా పుట్టించినారు.

## రెండవ పర్వము.

---

గు. విశ్వాసమంత్రము రెండవపర్వము చెప్పు?

శి. అతనియొక్క యేకసుతుడైన మనయొక్క నాథుడైన జేసుక్రీస్తును అంతఃయోగ్యభక్తిచేత విశ్వసిస్తున్నాను.

గు. జేసుక్రీస్తుఅనేవారు ఎవరు?

శి. అర్చ్యశిష్టత్రిత్వముయొక్క రెండవవారై పితయొక్క యేకకుమారుడై మనలను రక్షించుటకు మనిషియైపుట్టినవారే జేసుక్రీస్తు అనబడుచున్నారు.

గు. జేసుక్రీస్తును పితయొక్క యేకసుతుడని చెప్పడ మెందుకు?

శి. జేసుక్రీస్తుఒక్కరే పిత చేత నిత్యముగా జన్మించినందువల్లనున్ను యితనితో ఒక్కే దేవస్వభావమైయున్నందువల్లనున్ను అతని పితయొక్క యేకసతుడని చెప్పుచున్నాము.

గు. జేసుక్రీస్తును మనయొక్క నాథుడని చెప్పడమెందుకు?

శి. వారు తమరక్తము చిందబోసి మనలను పిశాచి అడిమెతనములోనుంచి రక్షించుకొనినందుచేత నే.

---

## మూడవ పర్వము.

గు. విశ్వాసమంత్రము మూడవపర్వము చెప్పు?

శి. ఇతడు స్పిరీతుసాంక్తు వల్ల గర్భమై యుద్భవించి కన్యమరియమ్మనుంచి పుట్టినారు.

గు. స్పిరీతుసాంక్తువల్ల గర్భమై యుద్భవించిరనేటందుకు అర్థమేమి?

శి. పితయొక్క దేవకుమారుడైన జేసుక్రీస్తు పరిశుద్ధకన్యస్త్రీ తిరు ఉదరములో అవతరించి యెత్తుకొన్న శరీరము స్పిరీతుసాంక్తువల్ల కలగజేయబడెనని యర్థమవును.

గు. కన్య మరియమ్మనుంచి పుట్టినారనేటందుకు అర్థమేమి?

శి. అర్చశిష్టకన్య మరియమ్మ తమ కన్నెరికము చెడక గర్భమై దేవకుమారుని కనినారని యర్థమవును.

గు. జేసుక్రీస్తు మనుష్యస్వభావమెత్తి దేవస్వభావము విడిచిపెట్టినారా?

శి. లేదు. దేవుడున్ను మనుష్యుడున్నై ఒకటిగానున్నారు.

గు. అర్చశిష్టమరియమ్మను దేవమాతఅనవచ్చునా?

శి. అవును. ఆమె దేవుడున్ను మనుష్యుడునై ఒకటిగానుండే జేసుక్రీస్తును కనినందు చేతనే.

---

## నాలుగవ పర్వము.



గు. విశ్వాసమంత్రము నాలుగవపర్వము చెప్పు?

శి. పోంచ్యుపిలాతుకింద నుపద్రవపడి స్లీవయందు మొలలుకొని కొట్టబడి మరణముపొంది సమాదిలో స్థాపించబడినారు.

గు. పోంచ్యుపిలాతుకింద నుపద్రవపడి స్లీవయందు మొలలుకొని కొట్టబడినారనేటందుకు అర్థమేమి?

శి. యూదదేశమేలుచు ఉండేవాడయిన పిలాతనేవాడు ఇచ్చిన అన్యాయ ఆజ్ఞాప్రకారము జేసుక్రీస్తు లెక్కలేని తిరస్కారావమాన నిర్బంధముల ననుభవించి స్లీవమీాద మొలలతో కొట్టబడినారని యర్థమవును.

గు. మరణము పొందినారనేటందుకు అర్థమేమి?

శి. జేసుక్రీస్తుయొక్క ఆత్మ శరీరమును వదిలివేసి నిజముగా వేరుభోయెనని అర్థమవును.

గు. దేవత్వము ఆత్మనున్ను శరీరమునున్ను వదిలి వేసి వేరుబోయెనా?

శి. లేదు. ఆత్మతోనున్ను శరీరముతోనున్ను యెప్పుడున్ను ఏకముగా కలిసియుండెను.

గు. జేసునాథుడు యేదినమందుమరణముపొందిరి?

శి. పెద్ద శుక్రవారదినమందు.

గు. ఎందుకు మరణముపొందినారు?

శి. మనలను పాప అడిమెతనములోనుంచి నరకవేదనలోనుంచి రక్షించి మనకు మోక్షభాగ్యము సంపాదించి యిచ్చుటకు మరణముపొందినారు.

గు. మననాథుడు మరణముపొందినప్పుడు ఏమినంభవించినది?

శి. సూర్యుడు చీకటిగాపోయి భూలోకమంత అంధకారములోనుండి భూమికంపించి దేవాలయపు తెర నడిమికి చినిగిపోయి కొండలు బద్దలయి సమాధులు తెరవబడి చనిపోయిన అనేక పుణ్యాత్ములుమళ్లీ జీవనవంతులై లేచి జెరుసలేమ్ పట్టణములో చాలా మందికి అగుబడినారు.

గు. సమాధిలో స్థాపించబడినారనేటందుకు అర్థమేమి?

శి. జేసుక్రీస్తు మరణముపొందిన తరువాత కొందరు పుణ్యాత్ములు వారిశరీరము స్లీవనుంచి దించి బట్టతో కప్పివేసి సమాధిలో నుంచినారని అర్థమవును.

## అయిదవపర్వము.

గు. విశ్వాసమంత్రము అయిదవపర్వము చెప్పు?

శి. పాతాళమునకు దిగి మూండవనాడు మృతమైన వారిలోనుంచి లేచినారు.

గు. పాతాళమునకు దిగినారనేటందుకు అర్థమేమి?

శి. జేసుక్రీస్తుయొక్క ఆత్మ శరీరమును విడిచి వేగు పోయిన తక్షణము పాతాళమునకు దిగెనని అర్థమవును.

గు. జేసునాథుని ఆత్మదిగిన పాతాళమనగానేమి?

శి. లోకముయొక్క మొదటినుంచి యిష్టప్రసాదముతో చనిపోయినవారియొక్క ఆత్మలు ఉండినస్థలము జేసునాథుని ఆత్మదిగిన పాతాళమనబడును.

గు. జేసునాథస్వామి రావడమునకు మునుపు మనుష్యులు రక్షణము పొందనజేలాగు?

శి. వాగ్దత్తమైన రక్షకునియందు విశ్వాసముచేత నున్ను దేవకల్పనలను అనుసరించినందుచేత నున్ను.

గు. అప్పుడు ఎందుకు మోక్షానికి వెళ్లక పాతాళ మందు కనిపెట్టుకొని యుండినారు?

శి. మన ఆది తలిదండ్రుల పాపముచేత మోక్షము మూయబడి జేసునాథస్వామిచేతనే తెరవ బడవలసినందువల్ల పుణ్యాత్ములు ఆదివ్యరక్ష కుని కొరకు పాతాళమందు ఎదురుచూస్తు ఉండినారు.

గు. జేసునాథుని ఆత్మ యెందుకొరకు పాతాళము నకు దిగెను?

శి. ఆస్థలములోనుండిన పుణ్యాత్ములను విడుదలచేసి వారలను మోక్షానికి తోడుకొని పోవుటకు దిగెను.

గు. మృతమైన వారిలోనుంచి లేచినారనేటందుకు అర్థమేమి?

శి. జేసునాథుడు మరణముపొందిన మూడవరోజున తమ ఆత్మనున్ను శరీరమునున్ను కలిపిసమాధి విడిచిపెట్టి మళ్లీ జీవవంతులై లేచినారని అర్థమవును.

గు. ఏరోజున తిరుగా జీవనవంతులై లేచినారు?

శి. పాస్కాపండుగరోజున తిరుగా జీవనవంతులై లే
చినారు.

గు. లేచినతరువాత నెన్నిదినములు భూలోకమం
దు ఉండినారు?

శి నలభై దినము లుండినారు.

గు. నలభై దినములలో నేమి చేసుకొని యుండి
నారు?

శి. తాము నిజముగా జీవనవంతులై లేచినామనే
సత్యము దృఢపరుచుటకు తమశిష్యులకు అ
నేకమాఱ్లు దర్శనమై వారికి పలు పలు రహ
స్యములు తెలియజేసి తమ సువిశేషమంతయు
న్ను బోధించుటకు వారిని తగినవారుగా
చేసుకొనుచుండిరి.

## ఆ ర వ ప ర్వ ము.

గు. విశ్వాసమంత్రము ఆరవపర్వము చెప్పు?

శి. పరలోకమునకు వేంచేసి సర్వాధికారుడైన పిత
యైన సర్వేశ్వరుని కుడిపార్శ్వమున కూర్చు
న్నారు.

గు. జ్యోతిశ్చక్రాలకు వేంచేసినారనేటందుకు అర్థమేమి?

శి. జేసుక్రీస్తునాథుడు లేచిన నలభైయవదినములో తమ స్వబలిమిచేత ఆత్మతోనున్ను శరీరముతోనున్ను పరమండలమునకెక్కి వెళ్లినారని అర్థమవును.

గు. ఇప్పుడు జేసునాథుడు ఎక్కడ ఉన్నారు?

శి. సర్వేశ్వరుడై యున్నందు చొప్పున అంతట యున్నారు మనుష్యుడై యున్నందుచొప్పున పరమండలములోనున్ను సత్ప్రసాదములోనున్ను యున్నారు.

గు. సర్వవల్లభుడైన పితయైన సర్వేశ్వరుని కుడి పార్శ్వమున కూర్చున్నారనేటందుకు అర్థమేమి?

శి. జేసుక్రీస్తునాథుడు సర్వేశ్వరుడై యున్నందు చొప్పున తమ స్వమహిమచేతనున్ను బలముచేతనున్ను పితయైన సర్వేశ్వరునితో సరిసమానమై యున్నారనిన్ని మనుష్యుడై యున్నందుచొప్పున తాము యుత్తమ లక్షణములచేత సృష్టించబడిన సకలవస్తువులకు మేలైనవారై యున్నారనిన్ని అర్థమవును.

## పదవ పర్వము.

గు. విశ్వాసమంత్రము పదవపర్వము చెప్పు?

శి. అటునుంచి బ్రతికినవార్లకున్ను చచ్చిన వారల కున్ను న్యాయనిర్ణయము చేయవత్తురు.

గు. బ్రతికినవారలకున్ను చచ్చినవారలకున్ను న్యాయనిర్ణయము చేయవత్తురనేటందుకు అర్థమేమి?

శి. జేసునాథుడు లోకముగింపున అందరికి దృశ్యమైన మహామహిమప్రతాపముతో వేంచేసి జీవించేవారలకున్ను చచ్చినవారలకున్ను తీర్పుచేసి మంచివారికి బహుమానమున్ను చెడ్డవారికి శిక్షయున్ను కట్టడచేస్తారని అర్థము వ్వను.

గు. బ్రతికినవారలకున్ను చచ్చినవారలకున్ను అనేటందుకు అర్థమేమి?

శి. లోకారంభము నుంచి చచ్చిపోయిన వారలకున్ను లోకకడాపటిదినములలో జీవించి అగ్నిప్రళయమందు చచ్చియుండేవారలకున్ను పుణ్యాత్ములకున్ను పాపాత్ములకున్ను మనుష్యులందరికి జేసునాథస్వామి తీర్పుచేస్తారని అర్థమవ్వును.

గు. జేసునాథస్వామి కడాపట తీర్పు యెట్లాచేస్తారు?

శి. వారువారుచేసిన పాపపుణ్యములన్నిటిని అందరిమొదట బైలుపరిచి పాపాత్ములను శపించి పిశాచులతోకూడ నరకమందు త్రోసివేసి పుణ్యాత్ములను ఆశీర్వదించి తమతోకూడ మోక్షమునకు తోడుకొనిపోదురు.

## ఎనిమిదవ పర్వము.

---

గు. విశ్వాసమంత్ర మెనిమిదవ పర్వము చెప్పు?

శి. స్పిరీతుసాంక్తును అంతఃకరణభక్తిచేత విశ్వసిస్తున్నాను.

గు. స్పిరీతుసాంక్తు అనేవారెవ్వరు?

శి. త్రిత్వముయొక్క మూడవవారైన సర్వేశ్వరుడు స్పిరీతుసాంక్తు అనబడుదురు.

గు. స్పిరీతుసాంక్తును విశ్వసిస్తున్నానని నేటందుకు అర్థమేమి?

శి. స్పిరీతుసాంక్తు పితనుంచిన్ని సుతునినుంచిన్ని తోచుదురనిన్ని పితతోనున్ను సుతునితోనున్ను అన్నిటిలో సరిసమానమైయున్నారనిన్ని వారితోకూడ యొక్కే సర్వేశ్వరుడై

యున్నారనిన్ని దృఢముగా విశ్వసిస్తున్నానని అర్థమవును.

## తొమ్మిదవ పర్వము.

గు. విశ్వాసమంత్రము తొమ్మిదవపర్వము చెప్పు?

శి. పోత్తులుగానుండేటి అర్చశిష్టసభ అర్చశిష్టవారలయొక్క సముదిత ప్రయోజనాన్ని విశ్వసిస్తున్నారు.

గు. పోత్తులుగానుండే అర్చశిష్ట సభను విశ్వసిస్తున్నాననగా అర్థమేమి?

శి. ఒక్క తిరుసభ కలదనిన్ని దానిచేత బోధించబడిన సకల సత్యములను మనము దృఢముగా విశ్వసించవలెననిన్ని మరిన్ని దానిలో మాత్రమే మోక్షముపొందవచ్చుననిన్ని విశ్వసిస్తున్నానని అర్థమవును.

గు. తిరుసభ అనగా నేమి?

శి. జ్ఞానస్నానము పొంది జేసునాథసామి ఆనతిచ్చిన వేదసత్యములన్ని యొప్పుకొనుచుండి అర్చశిష్టపాపు అబ్బగారికి లోబడే వారియొక్క సంఘము తిరుసభ అనబడును.

ప్ర. నిజమైన తిరుసభను తెలుసుకొనుటకు గురుతులేవి?

కి. నిజమైన తిరుసభ యేకముగానున్న పరిశుద్ధముగానున్న పాత్రులుగానున్న అపోస్తులచేత స్థాపించి యుపదేశించబడేదిగానున్న యుండవలెను. ఈనాలుగు గురుతులు పొందినదే నిజమైన తిరుసభై యున్నది.

ప్ర. తిరుసభ యేకమై యుండవలెనని చెప్పేదియెందుకు?

కి. సకల క్రీస్తువులయొక్క ఉత్తమకూటమై యుండే తిరుసభకు ఒక్కేతల అయినవారున్న ఒక్కేవిశ్వాసమున్న ఒక్కే సమ్మికయున్న ఒక్కే బోధనయున్న యున్నందుచేత యేకమైయుండవలెనని చెప్పుచున్నాము.

ప్ర. తిరుసభ పరిశుద్ధమై యుండవలెనని చెప్పేదియెందుకు?

కి. తిరుసభయొక్క జ్ఞానబోధనయున్న దేవద్రవ్యానుమానములున్న ఆరాధనయున్న పరిశుద్ధమైయున్నందుచేతనున్న దానికి పరాత్పరగురువై యుండే జేసుక్రీస్తునాధుడు పరిశుద్ధత్వమునకు ఊటఅయియున్నందుచేతనున్న

దానిలో మాత్రము అర్చ్ఛిష్టవారలు కలిగి యున్నందుచేతనున్ను పరిశుద్ధమై యుండవలెనని చెప్పుచున్నాము.

గు. తిరుసభ పాత్రులుగా నుండవలెనని చెప్పేదియెందుకు?

శి. ఏకాలమందున్ను యేస్థలమందున్ను యేకరీతిగా వృద్ధిపొంది వ్యాపించియున్నందుచేత పాత్రులుగా నుండవలెనని చెప్పుచున్నాము.

గు. తిరుసభ అపోస్తలవారిచేత స్థాపించి యుపదేశించబడేదిగా నుండవలెనని చెప్పేది యెందుకు?

శి. అపోస్తలవారివల్లనే స్థాపించబడి వారు బోధించిన సత్యములన్ని విశ్వసించి బోధించునందుచేతనున్ను వారియొక్క స్థానములోనుండే అర్చ్ఛిష్టపాపులయ్యగారివల్లనున్ను మేత్రాణులవారివల్లనున్ను యేలబడి నందుచేతనున్ను అపోస్తలవారిచేత స్థాపించియుపదేశించబడేదిగా నుండవలెనని చెప్పుచున్నాము.

గు. ఏకముగానున్ను పరిశుద్ధముగానున్ను పాత్రులుగానున్ను అపోస్తలవారిచేత స్థాపించి యుపదేశించ బడేదిగానును, యుండే తిరుసభ యేది?

శి. జేసుక్రీస్తుయొక్క ఒక్కనిజమైన తిరుసభైన రోమానబడిన తిరుసభమాత్రమే.

గు. జేసుక్రీస్తుయొక్క తిరుసభ యెందుకు రోమాన్తిరుసభ అనబడును?

శి అర్చ్యశిష్టరాయప్పగారు జేసుక్రీస్తునల్ల తిరుసభకు తలయయినవారుగా నియమించబడి రోమాపురిలో వచ్చి ఆపట్టణము తమకున్ను తిమ పట్టణములో పారంపర్యముగా వచ్చే అబ్బపాపుగార్లకున్ను ప్రధానస్థాన పీఠముగా నిర్ణయించి స్థాపించి నందుచేత జేసుక్రీస్తు యొక్క తిరుసభ రోమాన్తిరుసభ అనబడును.

గు. అర్చ్యశిష్టరాయప్పగారి స్థానములో తిరుసభకు తలయయిన వారెవ్వరు?

శి. అర్చ్యశిష్టపాపు అబ్బగారే.

గు తిరుసభకు పాలించి నడిపించుటకు అధికారము అర్చ్యశిష్ట పాపుఅబ్బగారికి మాత్రమా?

శి. వారికి లోబడియుండే మేత్రాణుల వార్లకున్ను వీరిమూలముగా గురువులకున్ను అధికారమున్నది.

గు. తిరుసభకు తలయయినవారై వేదబోధకులై యుండే అర్చ్యశిష్టపాపుఅబ్బగారికిన్ని మేత్రా

ణులవార్లకున్ను గురువులకున్ను లోబడని వార్లకు సంభవించేదేమి?

శి. జేసుక్రీస్తుచేత విడవబడి తిరుసభకు బైటత్రోయబడి పోవుదురు.

గు. తిరుసభ వేదబోధనలో పొరబడి మోసపోవచ్చునా?

శి. కూడదు. స్పిరీతుసాంక్తువల్ల నేలబడినందుచేత పొరబడదు.

గు. తిరుసభ అజ్ఞానులు తురకలు యూదులు పతితులు మొదలయిన శత్రువులచేత చెరుపబడవచ్చునా?

శి. కూడదు. లోకముగింపుపర్యంతము మాతిరుసభను నిలకడగా నిలుపుతామని జేసుక్రీస్తునాథుడు ఆనతిచ్చినందువల్ల చెడిపోదు.

గు. అర్చశిష్టవార్లయొక్క సముదిత ప్రయోజనము నగా నేమి?

శి. తిరుసభలోనుండే క్రీస్తువులందరు దాని సకల జ్ఞానమేలులకు పాలివారైయున్నారని అర్థమవును.

గు. తిరుసభయొక్క జ్ఞానమేలులేవి?

శి. దేవద్రవ్యఅనుమానములున్ను దివ్యపూజ బలి జపతప దానధర్మములున్ను వాటిలోగలిగిన

తిరుఫలముతే తిరుసభయొక్క జ్ఞానమేలు లవును.

గు. మోక్షనివాసులకున్ను మనకున్ను పొత్తుప్రయోజనమున్నదా?

శి. ఉన్నది. మనము వారిని సన్మానించి వేడుకొని వారి ప్రార్థనమూలముగా సర్వేశ్వరునిసన్నిధిలో అనేక సాహాయ్యములను పొందినందువల్లనే.

గు. ఉత్తరించేస్థలములోనుండే ఆత్మలకున్ను మనకున్ను పొత్తుప్రయోజనమున్నదా?

శి. ఉన్నది. మనము వారికి సాహాయ్యముగా సెప్పగించే పూజ జప తప దానధర్మములను చూచి సర్వేశ్వరుడు వారు అనుభవించే వేదనలను తక్కువచేయుటవల్లనున్ను వారు మోక్షముపొందగానే మనకొరకై వేడుకొనుటవల్లనున్ను.

గు. తిరుసభయొక్క జ్ఞానమేలులలో పాలు లేనివారెవ్వరు?

శి. అజ్ఞానులున్ను తురకలున్ను యూదులున్ను పతితులున్ను తిరుసభ విడిచిపెట్టినవారున్ను తిరుసభకు బైట త్రోయబడినవారున్నే.

గు. వారందరు తిరుసభయొక్క జ్ఞానమేలులకు పాలులేనివారై యున్నారని చెప్పుటకు హేతువేమి?

శి. వార్లందరు తిరుసభకు బైటనున్నందుచేతనే.

---

## పదియవపర్వము.

---

గు. విశ్వాసమంత్రము పదియవపర్వము చెప్పు?

శి. పాపక్షయాన్ని విశ్వసిస్తున్నాను.

గు. పాపక్షయాన్ని విశ్వసిస్తున్నాననేటందుకు అర్థమేమి?

శి. సకలపాపములను క్షమించుకొనేటందుకు జేసునాథుడు తమ తిరుసభకు వల్లభమివ్వనవధరించినారని విశ్వసిస్తున్నానని అర్థమవును.

గు. తిరుసభలో పాపములను క్షమించుకొనుటకు వల్లభము పొందేవారెవ్వరు?

శి. అర్చిష్టపాపు అబ్బగారున్ను మేత్రాణులున్ను గురువులున్నే.

గు. అర్చిష్టపాపు అబ్బగారున్ను మేత్రాణులున్ను గురువులున్ను యేలాగుపాపములను క్షమించుచున్నారు?

శి. దేవద్రవ్య అనుమానముల మూలముగా పాపములను క్షమించుచున్నారు.

---

పదకొండవ పర్వము.

గు. విశ్వాసమంత్రము పదకొండవపర్వము చెప్పు?
శి. మాంసఉత్థానాన్ని విశ్వసిస్తున్నాను.
గు. మాంసఉత్థానాన్ని విశ్వసిస్తున్నానటందుకు అర్థమేమి?
శి. లోకముగింపున చనిపోయినవారందరు దేవశక్తిచేత మళ్లీ శరీరముతో కూడ జీవనవంతులై లేస్తారని అర్థమవును.

---

పండ్రెండవ పర్వము.

గు. విశ్వాసమంత్రము పండ్రెండవపర్వము చెప్పు?
శి. సతతమైన జీవాన్ని విశ్వసిస్తున్నాను.
గు. సతతమైన జీవాన్ని విశ్వసిస్తున్నానటందుకు అర్థమేమి?
శి. జీవనవంతులై లేచినవారు మరియొక్క నాటికిన్ని చావకుండ మంచివారు మోక్షములో సకల ఆనందభాగ్యములున్ను దుర్మార్గులు నరకములో మితిలేని వేదనలున్ను నిత్యముగా అనుభవిస్తారని అర్థమవును.

# మూడవ భాగము.



## మోక్షభాగ్యము పొందేటందుకు అనుసరించే వలసిన కల్పనలనున్ను పుణ్యములనున్ను గురించి.

---



### మొదటి పాఠము.

### దేవకల్పనలను గురించి.

గు. మోక్షభాగ్యము పొందుటకు వేదసత్యములను విశ్వసించుట చాలునా?

శి. చాలదు. సర్వేశ్వరునియొక్క కల్పనలనున్ను తిరుసభయొక్క కట్టడలనున్ను అనుసరించి పాపము విడిచిపెట్టి పుణ్యము చేయవలసినది.

గు. దేవకల్పనలనగా నేమి?

శి. మోక్షము పొందుటకు చేయవలసినదానిని గురించిన్ని చేయవద్దన్నదానిని గురించిన్ని సర్వేశ్వరుడు మనుష్యులకిచ్చిన ఆజ్ఞలయొక్క సంక్షేపము దేవకల్పనలు అనబడును.

గు. సర్వేశ్వరుడు మనకొసంగిచ్చిన వేదకల్పనలెన్ని?

శి. పది.

గు. పదికల్పనలు చెప్పు.

శి. సర్వేశ్వరుడు మనకానతిచ్చిన వేద కల్పనలు పది. అందులో ఇత్యాది.

గు. ఆపదికల్పనలన్నిటిని అనుసరించవలసినదా?

శి. వాటినన్నిటిని అనుసరించవలసినదే.

గు. మొదటి కల్పన చెప్పు?

శి. సర్వేశ్వరుని ఒక్కరికిమాత్రము ఆరాధన చేతువుగాక.

గు. ఈకల్పనచేత మనకాజ్ఞాపించి యుండేదేమి?

శి. ఒక్కే సర్వేశ్వరుడు కలడని విశ్వసించనున్న వారిని నిండుమనస్సుతో స్నేహించనున్న వారిమీాద మన నమ్మికనంతె యుంచనున్న వారికి మేలైన ఆరాధనగు పూజ బలినిన్ని ప్రార్థననున్ను జపము మొదలైన దానినిన్ని యొప్పగించనున్ను యాజ్ఞాపించియున్నది.

గు. ఈకల్పనచేత మనకు నిషేధించియుండేదేమి?

శి. సృష్టించబడిన వస్తువులకు దేవ ఆరాధనచేయ వద్దని నిషేధించియున్నది.

గు. రెండవ కల్పనచెప్పు?

శి. సర్వేశ్వరునియొక్క తిరునామము వ్యర్థముగా స్వీకరించక యుందువుగాక.

గు. ఈకల్పనచేత మనకు నిషేధించియుండేదేమి?

శి. అక్రమముగా ప్రమాణము చేయుటను దేవ దూషణ చెప్పుటను దేవద్రోహము చేయుటను వద్దని నిషేధించియున్నది.

గు. మూడవకల్పన చెప్పు?

శి. సర్వేశ్వరునియొక్క యుత్సవదినములు ఆచరించ తలంపుదువుగాక.

గు. ఈకల్పనచేత మనకాజ్ఞాపించియుండేదేమి?

శి. ఆదివారములనున్ను అప్పుపండుగులనున్ను అనుసరించవలెనని యాజ్ఞాపించియున్నది.

గు. ఈరోజులను అనుసరించడానికి యేమేమి చేయవలెను.

శి. ఈరోజులలో శరీరప్రయాసమైన పనులను చేయక కూడినచోప్పున భక్తితోనున్ను వినయముతోనున్ను పూజప్రసంగము విని జప తప దానధర్మములున్ను చేసుకొనుచుండవలెను.

గు. నాలుగవ కల్పన చెప్పు?

శి. తల్లిదండ్రులను బహుమానముగా నడుపుదువుగాక.

గు. ఈకల్పనచేత మనకాజ్ఞాపించియుండేదేమి?

శి. తల్లిదండ్రులనున్ను పెద్దవార్లనున్ను సన్మానించనున్ను వార్లకు లోపడనున్ను వార్లయొక్క అవసరములయందు సాహాయ్యము చేయనున్ను ఆజ్ఞాపించి యున్నది.

గు. ఈకల్పనచేత మరేమి ఆజ్ఞాపించి యున్నది?

శి. తల్లిదండ్రులు తమబిడ్డలకు వేదముయొక్క ప్రధానసత్యములు బోధించనున్ను మంచిమాత్రికలు చూపించనున్ను అన్నవస్త్రము లిప్పించనున్ను వార్లను న్యాయముగా దండించనున్ను ఆజ్ఞాపించియున్నది.

గు. అయిదవ కల్పనచెప్పు?

శి. నరహత్యచేయక ఉందువుగాక.

గు. ఈకల్పనచేత మనకునిషేధించియుండేదేమి?

శి. పొరుగువానిమీద కోపించనున్ను పగదీర్చనున్ను వానిని శాపించనున్ను కొట్టనున్ను చంపనున్ను వానికి దుర్బుద్ధి చెప్పనున్ను దుర్మాత్రిక చూపించనున్ను వానిమీద హేతువులేక సందేహపడనున్ను అపకీర్తిగా మాట్లాడనున్ను చాడీ కొండెము చెప్పనున్ను వద్దని నిషేధించియున్నది.

గు. ఆరవకల్పన చెప్పు?

శి. మోహా అగమ్యాగమనము చేయక ఉందువు గాక.

గు. ఈకల్పనచేత మనకు నిషేధించియుండేదేమి?

శి. విరక్తత్వముకు విరోధమైయుండే మోహాక్రియలున్ను చెడ్డచూపులున్ను యుదాసీన మాటలున్ను అనుచితమైన పాటలున్ను నిషేధించియున్నది.

గు. ఏవడకల్పన చెప్పు?

శి. దొంగలించక యుందువుగాక.

గు. ఈకల్పనచేత నిషేధించియుండేదేమి?

శి. పొరుగువానియొక్క ధనము దొంగలించనున్ను చెరుపనున్ను అన్యాయవడ్డి పొందనున్ను అప్పులవారికి యుప్పులు చెల్లించక అన్యాయ తామసము చేయనున్ను వద్దని నిషేధించి యున్నది.

గు. ఎనిమిదవ కల్పన చెప్పు?

శి. దబ్బరసాక్షి పలకక యుందువుగాక.

గు. ఈకల్పనచేత నిషేధించి యుండేదేమి?

శి. అబద్ధమున్ను అబద్ధసాక్ష్యమున్ను చెప్పవద్దని నిషేధించి యున్నది.

గు. తొమ్మిదవ కల్పన చెప్పు?

శి. పరదారను అపేక్షించక ఉండువుగాక.

గు. ఈకల్పనచేత మనకు నిషేధించి యుండేదేమి?

శి. పవిత్రత్వముకు విరోధముగా ఆశపడనున్ను దానికి అంటుకొనే దుర్తలంపులు రానివ్వనున్ను వద్దని నిషేధించి యున్నది.

గు. పదవకల్పన చెప్పు?

శి పరులసొమ్ములకు ఆశించక ఉండువుగాక.

గు. ఈకల్పనచేత మనకు నిషేధించి యుండేదేమి?

శి. పొరుగువాని ధనతులమీద ఆశపడనున్ను వాటిని అన్యాయముగా సంపాదించ ప్రయాసపడనున్ను వద్దని నిషేధించి యున్నది.

౨-వ పాఠము.

తిరుసభ కట్టడలను గురించి.

గు. తిరుసభకట్టడలెన్ని?

శి. అయిదు.

గు. ఆ అయిదుకట్టడలు చెప్పు?

శి. తిరుసభకట్టడలు.

గు. ఈకట్టడలు అనుసరించుట ఋణమైన అప్పా?

శి. కూడినమాత్రము వీటినన్నిటిని అనుసరించుట ఋణమైన అప్పే.

గు. మొదటి కట్టడ చెప్పు?

శి. ఆదివారములలోనున్ను అప్పుపండుగులలోనున్ను నిండుపూజ కనవలెను.

గు. ఈకట్టడచేత అజ్ఞాపించి యుండేదేమి?

శి. ఆదివారములలోనున్ను అప్పు పండుగలలోనున్ను భక్తితోనున్ను వినయముతోనున్ను నిండుపూజ కనవలెనని అజ్ఞాపించియున్నది.

గు. ఇటువంటి దినములలో పూజకనుట యెవ్వరికి ఋణమైన అప్పుకాదు?

శి. నిజమైన విఘ్నము కలిగినందున పూజకనలేనివారికి.

గు. రెండవకట్టడ చెప్పు?

శి. ఏడాదికి యొక్కసారియైనను పాపసంకీర్తనము చేయవలెను.

గు. ఈకట్టడచేత కట్టుచేసి యుండేదేమి?

శి. బుద్ధితెలిసిన సకలక్రీస్తువులు ప్రతి సంవత్సరానికి యొక్కసారియైనను మంచి పాపసంకీర్తనము చేయవలెనని కట్టడచేసియున్నది.

గు. మూడవకట్టడ చెప్పు?

శి. పాస్కపండుగలో సత్ప్రసాదానికి ఆయత్తము
గా నుండవలెను.

గు. ఈకట్టడచేత కట్టుచేసియుండేదేమి?

శి. సత్ప్రసాదములో జేసునాథుడు ఆత్మతోనున్ను శరీరముతోనున్ను దేవస్వభావముతోనున్ను నిజముగా వేంచేసియున్నారనే పరమరహస్యము తెలుసుకొని విశ్వసించి దానిని పొందుటకు క్రీస్తువులందరు పాస్కపండుగలలో మంచి పాపసంకీర్తనము చేసి సత్ప్రసాదము పొందవలెనని కట్టడ చేసియున్నది.

గు. పాస్కకట్టడతీర్చని వార్లకు దొరుకతగిన శిక్షయేమి?

శి. పాస్కకట్టడతీర్చేవర్యంతము తిరుసభకు బయిటత్రోయబడి శాపముపొందుటగాక, సముదితప్రయోజనముచేత గలిగిన ప్రార్థనఫలము పోగొట్టిపోవుటకున్ను చచ్చిపోయినపక్షమందు మంచిభూస్థాపితము దొరకకుండుటకున్ను పాత్రులైయున్నారు.

గు. నాలుగవ కట్టడ చెప్పు?

శి. శుక్రవారము మాంసవర్జితముగానుండి తిరుసభ కట్టడ చేసిన దినాలలో ఒక్కపొద్దుగాను

న్ను శుద్ధభోజనముగానున్ను యుండవలెను.

గు. ఈకట్టడచేత కట్టుచేసియుండేదేమి?

శి. తపస్సు దినములలోనున్ను తిరుసభ కట్టడచేసిన తక్కినదినములలోనున్ను యుపవాసముగానుండనున్ను శుక్రవారములలోనున్ను తపస్సు దినములలోనున్ను తక్కిన శుద్ధభోజన దినములలోనున్ను మాంసము తినకుండ యుండనున్ను కట్టడచేసియున్నది.

గు. ఒక్కపొద్దుగా నుండ నెవ్వరికి ఋణమైన అప్పుకాదు?

శి. వ్యాధిగలవారికిన్ని శరీరప్రయాసమైన పనిచేసేవారికిన్ని గర్భముతోనుండే స్త్రీలకున్ను బిడ్డలకు పాలిచ్చేవారికిన్ని ప్రాయము లేని వారికిన్నీ.

గు. శుద్ధభోజనదినములలో శుద్ధ భోజనముగానుండ నెవ్వరికి ఋణమైన అప్పుకాదు?

శి. వ్యాధిగలవారికిన్ని మాంసముగాక యేమి లేని వారికిన్నీ.

౩-వ పాఠము.

## పుణ్యమును గురించి.

గు. పుణ్యమనగా నేమి?

శి. మేలుచేసుటకు మనలను ప్రేరేపించే మేలైన అభ్యాసము పుణ్యమనబడును.

గు. పుణ్యము లెన్నివిధములుగా నున్నవి?

శి. దేవసంబంధమైన పుణ్యములని, సన్మార్గసంబంధమైన పుణ్యములని రెండు విధములుగా నున్నవి.

గు. దేవసంబంధమైన పుణ్యములనగా నేమి?

శి. సర్వేశ్వరుని సూటిగా గురించిన పుణ్యములే.

గు. సన్మార్గసంబంధమైన పుణ్యములనగా నేమి?

శి. మనమంచినడతను సూటిగా గురించిన పుణ్యములే.

గు. దేవసంబంధమైన పుణ్యములెన్ని?

శి. మూడు. ఇవి యేవంటే, విశ్వాసము, నమ్మిక, దేవస్నేహము.

గు. విశ్వాసమనగా నేమి?

శి. సర్వేశ్వరునిన్ని వారు తిరుసభకు తెలియజేసిన సకలసత్యములనున్ను మనలను విశ్వసింపచే సేమేలైన వరమే విశ్వాసమనబడును.

గు. విశ్వాసము క్రియ చెప్పు?

శి. విశ్వాసము క్రియ.

గు. నమ్మిక అనగానేమి?

శి. జేసుక్రీస్తునాథుడు పొందిన పుణ్య ఫలములను చూచి సర్వేశ్వరుడు ఈలోకమందు పాప క్షయమునున్ను కావలసిన వరప్రసాదముల నున్ను మరులోకమందు మోక్షమునున్ను మనకివ్వనవధరించుదురని మనలను నమ్మింప చేయించే మేలైనవరమే నమ్మికఅనబడును.

గు. నమ్మిక క్రియ చెప్పు?

శి. నమ్మిక క్రియ.

గు. దేవస్నేహమనగా నేమి?

శి. అంతటికన్న సర్వేశ్వరునిన్ని వారినిగురించి మనలను మనము స్నేహించినట్టు పొరుగువానిని మనలను స్నేహింపచేసే మేలైనవరమే దేవస్నేహమనబడును.

గు. దేవస్నేహము క్రియచెప్పు?

శి. దేవస్నేహము క్రియ.

గు. ఈమూడు క్రియలను ఒక్కొక్కప్పుడు చెప్పుట ఋణమైన అప్పా?

శి. ఋణమైన అప్పే, విశేషముగా విశ్వాసము నమ్మిక దేవస్నేహములకు విరోధముగా సందేహము వచ్చేటప్పుడున్ను మరణావస్థ సమయమందున్ను చెప్పవలసినది.

గు. సన్మార్గసంబంధమైన పుణ్యములెన్ని?

శి: నాలుగు. ౧-ది వివేకము; ౨-ది నీతి; ౩-ది మనోదిట్టము; ౪-ది మితభోజనము.

గు. వివేకమనగా నేమి?

శి. మనలను సర్వేశ్వరుని సమీపించుటకు నిజ మూలముల నెరిగి యెంచుకొనేచేసే పుణ్యము వివేకమవును.

గు. నీతి అనగా నేమి?

శి. ప్రతిమనిషికి తమతమ సొత్తుయిచ్చుటకు నిత్యమైన దృఢమనస్సు నీతి అనబడును.

గు. మనోదిట్టమనగా నేమి?

శి. మనలను మన ఆత్మరక్షణమునకు విరోధమైన విఘ్నములను జయింపచేసే పుణ్యము మనోదిట్టమనబడును.

గు. మితభోజన మనగా నేమి?

శి. మనలను ఈలోకమేలులను వివేకముగానున్ను మితముగానున్ను ఉపయోగింపచేసే పుణ్యము మితభోజనమనబడును.

——:o:——

౪-వ పాఠము.

## పాపమును గురించి.

గు. పాపమనగా నేమి?

శి. దేవకల్పన మీరిపోవడమే పాపమవును.

గు. పాప మెన్నివిధములుగా నున్నది?

శి. జన్మపాపమని కర్మపాపమని రెండువిధములుగా నున్నది.

గు. జన్మపాపమనగా నేమి?

శి మన ఆదితలిదండ్రులచేత గలిగి మనతోకూడ పుట్టేపాపము జన్మపాపమవును.

గు. ఆపాపము మనకు వచ్చేదేలాగు?

శి. మనమందరము ఆదితలిదండ్రులకు బిడ్డలముగా నున్నందున వారుచేసిన పాపమునకు జన్మమువల్ల నేరస్థులై యుండడమే.

గు. కర్మపాపమనగా నేమి?

శి. మనము బుద్ధిమెరిగినతరువాత మనస్సుపూర్వ
కముగా చేసుకొనేపాపమే.

గు. కర్మపాప మెన్నివిధములుగా నున్నది?

శి. చావైన పాపమని అల్పపాపమని రెండువిధము
లుగా నున్నది.

గు. చావైన పాపమనగా నేమి?

శి. ఘనమైన కార్యములో మనోత్సాహముగా దే
వకల్పనమీరుటే చావైన పాపమవును.

గు. చావైనపాపానికి భయపడుతు నడవవలసినదా?

శి. ఈలోకమందు సకల కీళ్లకు భయపడుతు నడ
చుటకంటే ఒక్కచావైన పాపానికి అధిక
ము.భయపడుతు నడవవలసినదే.

గు. చావైనపాపానికి యింత భయపడుతు నడుచు
ట యెందుకు?

శి. మనము చావైనపాపముచేత దేవయిష్టప్రసాద
మున్ను మోక్షస్వాతంత్ర్యిమున్ను మునుపుచే
సిన పుణ్య ఫలములున్ను పోగొట్టుకొనేదిగాక
పిశాచికి అడిమలై దేవకోపమునకున్ను నరక
వేదనకున్ను పాత్రిలమైపోయినందువల్ల నే.

గు. అల్పపాపమనగా నేమి?

శి. అల్ప కార్యములో మనోత్సాహము తక్కువ తోనైనను వేదకల్పన మీరడమే అల్పాపమవును.

గు. అల్పపాపానికి భయపడుతు నడవవద్దా?

శి. అల్పపాపము దేవయిష్టప్రసాదము తక్కువచేసి చావైనపాపానికి తోవఅయి యుండేటందువల్లనున్ను మనలను నిత్యశిక్షకు పాత్రులుగా చేసేటందువల్లనున్ను దానికి మిక్కిలి భయపడుతు నడవవలసినదే.

గు. కర్మపాపముఎన్ని విధములుగా కట్టుకొనుదుము?

శి. విచారము చేతనున్ను వాక్కుచేతనున్ను క్రియ చేతనున్ను చేయమిచేతనున్ను యీనాలుగు విధములుగా కట్టుకొనుదుము.

గు. విచారముచేత పాపముకట్టుకొనేదేలాగు?

శి. వేదకల్పనకు విరోధమైన దుర్తలంపు రానిచ్చినందువల్లనే.

గు. వాక్కుచేత పాపముకట్టుకొనే దేలాగు?

శి. వేదకల్పనకు విరోధముగా చెడ్డమాటలు చెప్పినందువల్లనే.

గు. క్రియచేత పాపముకట్టుకొనే దేలాగు?

శి. వేదకల్పనకు విరోధముగా దుష్క్రియ చేసినం దువల్లనే.

గు. చేయమిచేత పాపము కట్టుకొనేదెలాగు?

శి. వేదకల్పనచేత కట్టడచేసియుండేదానిని చేయక పోయినందువల్లనే.

---

౫-వ పాఠము.

---

తలఅయిన పాపములను గురించి.

---

గు. తలఅయిన పాపములు ఎన్ని?

శి. ఏడు. అవియేవంటే, ౧-ది అహంకారము; ౨-ది కోపము; ౩-ది మోహము; ౪-ది లోభితనము; ౫-ది భోజనప్రియము; ౬-ది మత్సరము; ౭-ది సోమరితనము.

గు. ఈ పాపము లెందుకు తలఅయిన పాపములన బడును?

శి. వీటిలో ఒకటొకటి అనేక పాపములకు ఊట అయి యుండేటందువల్లనే.

గు. అహంకారమనగా నేమి?

శి. అక్రమమైన స్వపక్షముచేత అందరికంటే తన్ను తానే ఘనముగా నెంచుటే అహంకార మవును.

గు. అహంకారముచేత గలిగే పాపములేవి?

శి. శ్లాఘ్యము, తుందుడుకు, పొగరు, ఆత్మాశ, పొరుగువానిని నిందించడము, కల్లజ్ఞానము, లోపడమి ఇవి మొదలైన పాపములు అహంకారముచేత కలిగియున్నవి.

గు. అహంకారమునకు విరోధమైన పుణ్యమేది?

శి. దీనత్వము.

గు. కోపమనగానేమి?

శి. మనకు అసహ్యమై యుండేదానిని బలవంతముగా త్రోయుటకు ప్రేరేపించే గుణము కోపమవును.

గు. కోపముచేత గలిగే పాపములేవి?

శి. మిత్రభేదము, పగ, జగడము, దూషణ, ఉపేక్ష, పగతీర్చవలెననే ఆశ, నరహత్య ఇవి మొదలైన పాపములు కోపముచేత గలిగియున్నవి.

గు. కోపమునకు విరోధమైన పుణ్యమేది?

శి. ఓర్పు.

గు. మోహమనగానేమి?

శి. విరక్తత్వమునకు విరోధమైన అశుచి యింపు ఆశించుట మోహమవును.

గు. మోహముచేత గలిగే పాపములేవి?

శి. మతిమైకము, మనఃకఠినము, సర్వేశ్వరుని మరువడము, తపస్సుచేయమి ఇవి మొదలైనకీళ్లు మోహముచేత గలిగియున్నవి.

గు. మోహమునకు విరోధమైన పుణ్యమేది?

శి. విరక్తత్వము.

గు. లోభితనమనగా నేమి?

శి. లోకధనములను మితముదాటి ఆశించుట లోభితనమవును.

గు. లోభితనముచేత గలిగే పాపములేవి?

శి. ఆత్మరక్షణమునుగురించి అశ్రద్ధ, దరిద్రులమీద కనికరపడమి, మోసము, అన్యాయవడ్డి, దొంగతనము ఇవి మొదలైన పాపములు లోభితనముచేత గలిగి యున్నవి.

గు. లోభితనమునకు విరోధమైన పుణ్యమేది?

శి. ఉదారత్వము.

గు. భోజనప్రియమనగా నేమి?

శి. అన్నపానములను మితముదాటి ఆశించుట భోజనప్రియమవును.

గు. భోజనప్రియముచేత గలిగే పాపములేవి?

శి. బుద్ధిచీకటి, పోట్లాట, జగడము, బూతు, దుష్ట తలంపు, మోహము ఇవి మొదలైన కీళ్లు భోజనప్రియముచేత గలిగి యున్నవి.

గు. భోజనప్రియమునకు విరోధమైన పుణ్యమేది?

శి. మితభోజనము.

గు. మత్సరమవగా నేమి?

శి. పొరుగువానికి గలిగియుండే మేలులను గురించి అన్యాయపడుటే మత్సరమవును.

గు. మత్సరముచేత గలిగే పాపము లేవి?

శి. అపదూరు, చాడికొండెము, వ్యర్థపంచేహము, పొరుగువాని వర్తితములో దుఃఖపడుట, వాని దుర్దశలో సంతోషపడుట, ఇవి మొదలైనపాపములు మత్సరముచేత గలిగియున్నవి.

గు. మత్సరమునకు విరోధమైన పుణ్యమేది?

శి. పరస్నేహము.

గు. సోమరితన మవగా నేమి?

శి. జప తప ధర్మములను గురించిన్ని తనస్థితి ఋణములను గురించిన్ని అసహ్యపడి మందముగా నుండుటే సోమరితనమవును.

గు. సోమరితనముచేత గలిగే పాపము లేవి?

శి. దేవుని కొలువులో అసమాధానము, ఉద్యోగము లో నిలువమి, వ్యర్థ కాలక్షయము, ఇవి మొదలైన పాపములు సోమరితనము చేత గలిగి యున్నవి.

గు. సోమరితనమునకు విరోధమైన పుణ్యమేది?

శి. చురుకు.



# నాలుగవ భాగము.

## దేవసహాయము పొందుటకు మనకు కలిగిన కారణములను గురించి.

### మొదటి పాఠము.

### దేవవరప్రసాదమును గురించి.

గు. పాపము తప్పించుకొని పుణ్యముచేసి మోక్షము పొందుటకు మనస్వంతబలము చాలునా?

శి. చాలదు. దేవ వరప్రసాదముయొక్క అనుగ్రహము అగత్యముగా కావలసినది.

గు. దేవవరప్రసాదమనగా నేమి?

శి. మనము నరకము తప్పించుకొని మోక్షము పొందుటకు సర్వేశ్వరుడు జేసుక్రీస్తునాథుని యొక్క తిరుఫలములనుచూచి మనకు ఉచితముగా నివ్వనవధరించె మేలైన వరమే దేవవరప్రసాదమును.

గు. మన ఆత్మరక్షణము పొందేటందుకు దేవవరప్రసాదము అగత్యముగా కావలెనా?

శి. దేవ వరప్రసాదము లేకుండ వేదకల్పనలను అనుసరించి సర్వేశ్వరునికి యిష్టమై పోయి

మోక్షభాగ్యమునకు పాత్రులయ్యే టట్టుగా ఏమి చేయలేము గనుక మన ఆత్మరక్షణము పొందే టందుకు దేవవరప్రసాదము అగత్యముగా కావలెను.

గు. దేవవరప్రసాద మెన్నివిధములుగా నున్నది?

శి. దేవ యిష్టప్రసాదమని దేవయనుగ్రహప్రసాదమని రెండువిధములుగా నున్నది.

గు. దేవయిష్టప్రసాదమనగా నేమి?

శి. మనలను పరిశుద్ధపరచి సర్వేశ్వరునికి యిష్టమైన వారినిగా జేసే మేలైన వరమే దేవ యిష్టప్రసాదమవును.

గు. దేవయిష్టప్రసాదము అందరికి కలిగియున్నదా?

శి. చావైనపాపము లేనివారందరికి కలిగియున్నది.

గు. మనుష్యులు దేనివల్ల దేవయిష్టప్రసాదము పోగొట్టికొనుచున్నారు?

శి. చావైనపాపము చేసేటందువల్లనే.

గు. దేవ అనుగ్రహప్రసాదమనగా నేమి?

శి. మనము కీడు తప్పించుకొని మేలు చేయుటకు మనకు సహాయముకొరకై సర్వేశ్వరుడు ఇన్వానపధరించే మేలైన వరమే దేవ అనుగ్రహప్రసాదమవును.

గు. దేవ అనుగ్రహప్రసాదము అందరికి కలిగియు
న్నదా?

శి. బుద్ధి యెరిగియుండే వారందరికి కలిగియున్నది.

గు. దేవ అనుగ్రహప్రసాదము మనకెల్లప్పుడు కలి
గియుండునా?

శి. క్షణమునకు క్షణము కావలసినప్పుడెల్ల కలిగి
యుండును.

గు. దేనివల్ల వరప్రసాదము పొందగలము?

శి. జపమువల్లనున్ను దేవద్రవ్య అనుమానముల
వల్లనున్ను పొందగలము.

---

౨౦వ పాఠము.

---

## జ ప ము ను గు రిం చి.

---

గు. జపమనగా నేమి?

శి. మనము కూడినమాత్రము భక్తితోనున్ను విన
యముతోనున్ను సర్వేశ్వరుని సన్నిధిలోనుం
డి మనము పొందిన యుపకారముల నిమిత్త
మై వారికి స్తోత్రము చేసి బ్రతికేటందుకు
న్ను మోక్షము పొందేటందుకున్ను కావల
సిన మేలులు మనకివ్వ సవధరించవలెనని వా
రిని వేడుకొనుటే జపమనబడును.

గు. తరుచుగా జపము చేయవలసినదా?

శి. ఎడతెగక వేడుకోవలెనని జేసునాథస్వామి ఆ జ్ఞాపించినారు.

గు. ఎడతెగక జపములో నుండేదేలాగు?

శి. రోజురోజు తగిన సమయములో జపించి ఒక్కొక్కప్పుడు సర్వేశ్వరుని తలంచుకొని వేడుకొని మనకష్టములన్ని వారికి యొప్పగించి మన కార్యములన్నిన్ని మనపనులన్నిన్ని వారినిపట్టి చేసినందువల్ల నెల్లప్పుడు జపములో నుండడమే.

గు. తరుచుగా జపముచేసే దెందుకు?

శి. ఎడతెగకుండ సర్వేశ్వరుని సహాయము మనకు అవసరమై యుండేటందువల్లనే.

గు. విశేషముగా నెప్పుడు జపముచేయవలసినది?

శి. ప్రాతస్సంధ్యవేళలలోనున్ను భోజనమునకు మున్నున్ను భోజనముచేసిన తర్వాతనున్ను పూజలోనున్ను ఆపదలోనున్ను పిశాచిశోధనలలోనున్ను ఇవి మొదలైన సమయములలో జపము చేయవలసినది?

గు. ఏలాగు జపము చేయవలసినది?

శి. అవధానముతోనున్ను దీనత్వముతోనున్ను నమ్మికతోనున్ను నిలకడతోనున్ను చేయవలసినది.

గు. జపములో నేమి అడుగవలసినది?

శి. సర్వేశ్వరుని స్తోత్రమునకున్ను మనరక్షణమునకున్ను తక్కినవారియొక్క రక్షణమునకు చేరిన వాటిని విశేషముగా అడుగవలసినది.

గు. లౌకిక మేలులను అడగవచ్చునా?

శి. వాటిని దేవచిత్తమునకు లోబడే మనస్సుతోనున్ను మంచితాత్పర్యముతోనున్ను అడగవచ్చునుగాని మరియొక ప్రకారముగా అడుగవద్దు.

గు. ఎవ్వరికొరకు జపముచేయవలసినది?

శి. మనకొరకున్ను మనబంధువుల పెద్దవార్లయుపకార్త స్నేహితుల మొదలైన సకల మనుష్యులకొరకున్ను జపము చేయవలసినది.

గు. జప మెన్నివిధములుగా నున్నది?

శి. మనోజపమని వాక్కుజపమని రెండు విధములుగా నున్నది.

గు. మనోజపమనగా నేమి?

శి. వాక్కుచేత ఏమియు నుచ్చరించకుండ హృదయములో మాత్రము సర్వేశ్వరుని వేడుకోవడమే మనోజపమనబడును.

గు. వాక్కు జపమనగా నేమి?

శి. మనస్సుచేత ధ్యానించి వాక్కుచేత నుచ్ఛరించి సర్వేశ్వరుని వేడుకోవడమే వాక్కు జపమనబడును.

గు. వాక్కుచేత మాత్రము వేడుకొనుటచాలునా?

శి. చాలదు. హృదయముచేత కూడ వేడుకోవలెను.

గు. ఎవ్వరినామముచేత ప్రార్థించవలెను?

శి. జేసుక్రీస్తుయొక్క నామముచేత ప్రార్థించ వలెను.

గు. ఎవరిని వేడుకోవలెను?

శి. సర్వేశ్వరుడు సకల మేలులకు ఆదికారణమై యున్నారు గనుక వారినిమాత్రము ప్రధానముగా ప్రార్థించి కర్తగాను వేడుకోవలెను.

గు. అర్చశిష్ట దేవమాతనున్ను అర్చశిష్టవార్లనున్ను యీప్రకారముగా వేడుకోకూడదా?

శి. కూడదు. దేవమాతనున్ను అర్చశిష్టవార్లనున్ను సర్వేశ్వరునియొద్ద మనకొరకై వేడుకోవలెనని ప్రార్థించుట చట్టమే.

### ౩-వ పాఠము.

## జ్యోతిశ్చక్రమంత్రమును గురించి.

---

గు. సకలజపములో సర్వేశ్వరునికి యుత్తమముగా ప్రియమైయుండే జపమేది?

శి. జ్యోతిశ్చక్రమంత్రము.

గు. ఎందుకు ఈజపము సర్వేశ్వరునికి యింతప్రియమై యున్నది?

శి. జేసునాథస్వామివారే యిది యుపదేశించినందు చేతనే.

గు. ఈమంత్రము చెప్పు?

శి. జ్యోతిశ్చక్రాలయందుండేటి—ఇత్యాది.

గు. ఈమంత్రమెన్ని పర్వములుగా నున్నది?

శి. ఏడుపర్వములుగా నున్నది.

గు. దాని మొదటిపర్వము చెప్పు?

శి. జ్యోతిశ్చక్రాలయందుండేటి మాయొక్క తండ్రీ! మీనామము అర్చింపబడునుగాక!

గు. మాయొక్క తండ్రీ అనే మాటతో ఆరంభమయ్యేదెందుకు?

శి. సర్వేశ్వరుడు మనతండ్రియై యున్నారనిన్ని మనము వారిబిడ్డలమై యున్నామనిన్ని జ్ఞాప

కములో నుంచినందువల్ల మనస్సులోపల న
మ్మకమున్ను దేవస్నేహమున్ను కలగచేసే
టందుకు.

గు. ఎందుకు మనము సర్వేశ్వరుని తండ్రి అను
చున్నాము?

శి. సర్వేశ్వరుడు మనలను సృష్టించి రక్షించి జ్ఞా
నస్నానముచేత తమతిరుసభలో బిడ్డలుగా
చేసినందువల్లనే.

గు. నాతండ్రి అనిచెప్పక మాయొక్క తండ్రి అని
చెప్పేదెందుకు?

శి. జేసునాథస్వామియందు మన సహోదరులై
యుండే సకల క్రీస్తువులతో ఐక్యముగా ప్రా
ర్థించేటందువల్లనే.

గు. జ్యోతిశ్చక్రాలయందుండేటి అని చెప్పేదెం
దుకు?

శి. సర్వేశ్వరుడు ఎందున్ను వ్యాపించియున్నప్ప
టికిన్ని విశేషముగా మోక్షములో నుండే
టందువల్లనే.

గు. ఈమొదటిపర్వములో యేమిప్రార్థించి అడుగు
కొనుచున్నాము?

శి. మనుష్యులందరు మనకు తండ్రియైయుండే సర్వేశ్వరుని తెలుసుకొని స్నేహించి స్తుతించవలెనని ప్రార్థించి అడుగుకొనుచున్నాము.

గు. రెండవ పర్వము చెప్పు?

శి. మీరాజ్యము వచ్చునుగాక.

గు. ఈరెండవపర్వములో నేమిప్రార్థించి అడుగుకొనుచున్నాము?

శి. ఈలోకమందు సర్వేశ్వరుడు తమ యిష్టప్రసాదముచేత మనహృదయములో రాజ్యముచేసి పరలోకమందు మనము వారితోకూడ రాజ్యము చేయవలెనని ప్రార్థించి అడుగుకొనుచున్నాము.

గు. మూడవపర్వము చెప్పు?

శి. మీచిత్తము జ్యోతిశ్చక్రమందు చేయబడినట్టు భూమియందున్ను చేయబడునుగాక.

గు. ఈమూడవ పర్వములో నేమిప్రార్థించి అడుగుకొనుచున్నాము?

శి. మనమందరము సమ్మనస్సులవలెనే మహాదేవభక్తితోనున్ను ప్రామాణికముతోనున్ను సర్వేశ్వరుని చిత్తానికి లోబడి నడిచేటట్టుగా దయచేయవలెనని ప్రార్థించి అడుగుకొనుచున్నాము.

గు. నాలుగవపర్వము చెప్పు?

శి. నానాటికి కావలసిన మాయన్నము మాకు నేటికివ్వండి.

గు. ఈనాలుగవ పర్వములో నేమి ప్రార్థించి అడుగుకొనుచున్నాము?

శి. ఆత్మకు భోజనమైయుండే దేవయిష్టప్రసాదము న్ను శరీరము జీవించుటకు కావలసినకార్యములున్ను మనకివ్వ నవధరించవలెనని ప్రార్థించి అడుగుకొనుచున్నాము.

గు. అయిదవపర్వము చెప్పు?

శి. మాయప్పులవారికి మేము ఓర్చినట్టు మాయప్పులను మీరుఓర్వండి.

గు. ఈ అయిదవ పర్వములో నేమి ప్రార్థించిఅడుగు కొనుచున్నాము.

శి. పొరుగువాడు మనకుచేసిన తప్పులను యేవిధముగా మనము క్షమించుచున్నామో ఆవిధముగానే మనముచేసిన తప్పులను సర్వేశ్వరుడు క్షమించవలెనని ప్రార్థించి అడుగుకొనుచున్నాము.

గు. ఈమంత్రము ఆరవపర్వము చెప్పు?

శి. మమ్ము శోధనయందు ప్రవేశించకుండ.

గు. ఈ ఆరవ పర్వములో నేమి ప్రార్థించి అడుగు కొనుచున్నాము?

శి. మనము పిశాచి తంత్రములో అగపడక పోయే ట్టుగా మనలను కాపాడి రక్షించవలెనని ప్రార్థించి అడుగుకొనుచున్నాము.

గు. ఈమంత్రము ఏడవపర్వము చెప్పు?

శి. కీడులోనుంచి మమ్ము రక్షించుకొనండి.

గు. ఈయేడవ పర్వములో నేమి ప్రార్థించి అడుగు కొనుచున్నాము?

శి. మనకు వచ్చే సకలకీళ్లలో అధికకీడై యుండే పాపములోనుంచి మనలను రక్షించవలెనని ప్రార్థించి అడుగుకొనుచున్నాము.

---

## ౮-వ పాఠము.

---

## ప్రియదత్తమును గురించి.

---

గు. ప్రియదత్త మంత్రము చెప్పు?

శి. ప్రియదత్తముచేత నిండిన మరియమ్మా — ఇత్యాది.

గు. ఈమంత్రము ఎవ్వరివాక్యము చేత కలుగ జేయబడినది?

శి. గాబ్రియేలనే సమ్మనస్సు వాక్యముచేతనున్ను యెలిజబేతమ్మ వాకుృచ్చిన వాక్యముచేతనున్ను తిరుసభ వాటికికూర్చిన వాక్యముచేతనున్ను కలగచేయఁబడినది.

గు. ఎందుకు యీమంత్రముచెప్పి వేడుకొనుచున్నాము?

శి. మనము అర్చశిష్ట దేవమాతయొక్క సహాయము పొందగలందులకు ఈమంత్రము చెప్పి వేడుకొనుచున్నాము.

౫-వ పాఠము.

దేవద్రివ్య అనుమానములను గురించి.

గు. దేవద్రివ్య అనుమానమనగా నేమి?

శి. మనలను పరిశుద్ధపరుచుటకు జేసునాథస్వామిచేత స్థాపించబడి పంచేంద్రియములకు అందే గురుతైన తిరుక్రియ దేవద్రివ్యఅనుమానమవును.

గు. దేవద్రివ్య అనుమానము లెన్ని?

శి. ఏడు. అవియేవంటే, ౧-ది జ్ఞానస్నానము; ౨-ది భద్రమైనఅభ్యాంగము; 3-ది సత్ప్రసాదము; ౪-ది పశ్చాత్తాపము; ౫-ది అవ

ష్ఠ అభ్యాంగము; ౬-ది గురుపట్టము; ౭-ది జ్ఞాన వివాహాము.

గు. దేవద్రవ్య అనుమానములు మనలను పరిశుద్ధ పరిచే దేలాగు?

శి జ్ఞానస్నానమున్ను పశ్చాత్తాపమున్ను పాపవిమోచనముచేసి మనముపాపముచేత పోగొట్టికొనిన దేవయిష్టప్రసాదము మనకు మళ్లీ రప్పించేటందువల్లనున్ను తక్కిన దేవద్రవ్య అనుమానములు మనయందుండే దేవయిష్ట ప్రసాదము వృద్ధిపొందచేసే టందువల్లనున్ను మనలను పరిశుద్ధపరచుచున్నది.

గు. దేవద్రివ్య అనుమానములు మనకు దేవయిష్ట ప్రిసాదము రప్పించే దేలాగు?

శి. జేసుక్రీస్తునాథుడు పాటుపడి మరణముపొంది ఆర్జించిన పుణ్యఫలములను మనకు ఫలితముగా జేసినందువల్లనే.

గు. ఒక్కసారిమాత్రిము పొందదగిన దేవద్రివ్య అనుమానము లేవి?

శి. జ్ఞానస్నానమున్ను భద్రిమైన అభ్యాంగమున్ను గురుపట్టమున్ను యీమూడే.

గు. మన ఆత్మరక్షణము పొందుటకు దేవద్రివ్య అ

నుమానములలో మిక్కిలి అవసరమైన దేవ
ద్రివ్య అనుమానములేవి?

శి. జ్ఞానస్నానమున్ను పశ్చాత్తాపమున్ను.

గు. మన ఆత్మరక్షణమూ పొందుటకు జ్ఞానస్నానము
న్ను పశ్చాత్తాపమున్ను మిక్కిలి అవసరమై
యున్నవని చెప్పేదెందుకు?

శి. జ్ఞానస్నానములేకుండ యెవ్వడైనను మోక్షము
పొందకూడ నందుచేతనున్ను పశ్చాత్తాప
ములేకుండ జ్ఞానస్నానము పొందినతరువాత
చేసినచావైన పాపములకు క్షమముపొంద
కూడ నందువల్లనున్ను యీరెండు దేవద్రి
వ్య అనుమానములు మిక్కిలి అవసరమై
యున్నవని చెప్పుచున్నాము.



మొదటి పర్వము.

---

జ్ఞానస్నానమును గురించి.

గు. జ్ఞానస్నాన మనగా నేమి?

శి. జన్మపాపమున్ను కర్మపాపమున్ను పోగొట్టి మ
నలను పర్వేశ్వరునికిన్ని తిరుసభకున్ను బిడ్డ
లుగాచేసే దేవద్రివ్య అనుమానము జ్ఞాన
స్నానమవును.

గు. జ్ఞానస్నానము చేత కర్మ్మపాపముకూడ విమోచనమవునా?

శి. జ్ఞానస్నానము పొందకమునుపు చేసికొనేకర్మ్మపాపములన్నికూడ జ్ఞానస్నానము చేత విమోచనమవుచున్నవి.

గు. ఎటువంటి ఆయత్తముతో జ్ఞానస్నానము పొందవలెను?

శి. శిశువులు ఏ ఆయత్తములేకుండ జ్ఞానస్నానము పొందవచ్చునుగాని బుద్ధి యెరిగినవారలు జ్ఞానస్నానముపొంద సమ్మతించవలసినదిగాక వేదసత్యములన్ని విశ్వసించి సర్వేశ్వరుని స్నేహించసాగి వేదకల్పనలను అనుసరించ మనస్సు నిశ్చయముగా నుండవలసినదిన్ని పాపము అసహ్యించి బొత్తిగా విడిచిపెట్టవలసినదిన్ని యిటువంటి ఆయత్తముతో జ్ఞానస్నానము పొందవలెను.

గు. జ్ఞానస్నానము ఇచ్చుటకు ఎవ్వరికి అధికారమున్నది?

శి. విశేషముగా మేత్రాణులవార్లకున్ను గురువులకున్ను యిటువంటి అధికారమున్నదిగాని అవసరమైన సమయములలో బుద్ధిగలవా

రందరు మగవారైనను, ఆడవారైనను జ్ఞానస్నానమివ్వవచ్చును.

గు. జ్ఞానస్నాన మిచ్చేదేలాగు?

శి. శుద్ధజలము ఎత్తి జ్ఞానస్నానము పొందేవాని తలమీఁదపోసి పోసేటప్పుడే పితయొక్కను న్ను సుతునియొక్కనున్ను స్పిరీతుసాంక్తుయొక్కనున్ను నామముచేత నేను నిన్ను కడుతున్నాను అని యీమంత్రము చెప్పవలెను.

గు. ఏతాత్పర్యముతో జ్ఞానస్నానముయివ్వఁలెను?

శి. తిరుసభలో జ్ఞానస్నానము ఇచ్చినట్టు నేనున్ను జ్ఞానస్నానమునిస్తున్నానను తాత్పర్యముతో నివ్వవలెను.

గు. జ్ఞానస్నానము పొందేవానితో ఏమాట యిత్తుము?

శి. పిశాచినిన్ని దీనిక్రియలనున్ను ఆడంబరములనున్ను విశీచి పెట్టుతున్నామనిన్ని జేసుక్రిస్తుయొక్క వేదముచేకొని దానిప్రకారముగా నడుస్తున్నామనిన్ని మాటయిత్తుము.



## భద్రమైన అభ్యాంగమును గురించి.

---

ప్ర. భద్రమైన అభ్యాంగమనగా నేమి?

మనలను సత్యవేదములో దృఢపరుచుటకు స్పిరీతుసాంక్తునున్ను యితనియొక్క వరప్రసాదములనున్ను సంపూర్ణముగా నిచ్చి మనలను ఉత్తమక్రీస్తువులుగా చేసే దేవద్రవ్యానుమానము భద్రమైన అభ్యాంగమవును.

ప్ర. భద్రమైన అంభ్యాంగము మనకు స్పిరీతుసాంక్తును ఇచ్చునదేటందుకు అర్థమేమి?

ఉ. భద్రమైన అభ్యాంగము మూలముగా విశేషముగా స్పిరీతుసాంక్తు మనయందు వాసమై యుండుటకు వేంచేయుమరని అర్థమవును.

ప్ర. భద్రమైన అభ్యాంగము మూలముగా స్పిరీతుసాంక్తు వేంచేయ నవధరించి మనకు దయచేసే వరప్రసాదములెన్ని?

ఉ. ఏడు. అవియేవంటే, ౧-ది జ్ఞానము; ౨-ది బుద్ధి; ౩-వి విమర్శ; ౪-ది దృఢము; ౫-ది తెలివి; ౬-ది భక్తి; ౭-ది దేవభయము.

గు. జ్ఞానమనగా నేమి?

శి. మనలను ఈలోక కార్యములను అలక్ష్యము చేసి సర్వేశ్వరుని సంబంధమైన కార్యములను ఆశింపచేసే మేలైన వరమే జ్ఞానమవును.

గు. బుద్ధి అనగా నేమి?

శి. వేదసత్యములను చక్కగా తెలుసుకొనేటట్టు మనస్సులోపల వెలుగు కలుగజేసే మేలైన వరము బుద్ధియనబడును.

గు. విమర్శ అనగా నేమి?

శి. మనలను ఆయాసంగతులలో అంతటికన్న సర్వేశ్వరుని స్తోత్రమునకున్ను మన ఆత్మరక్షణమునకున్ను అధికముగా తగినదానిని కనుకొనేటట్లు చేసే మేలైనవరము విమర్శ అవును.

గు దృఢమనగా నేమి?

శి. పిశాచితంత్రములను జయించుటకున్ను జేసునాథస్వామిని అంగీకరించుటకున్ను వీరినిమిత్తము కష్టపడుటకున్ను మనకు ధైర్యమిచ్చే మేలైనవరము దృఢమవును.

గు. తెలివి అనగా నేమి?

శి. విద్యపొందుటకు విశేషముగా సర్వేశ్వరుని గు

రించిన్ని మన ఆత్మనుగురించిన్ని విద్యసంపాదించుటకు సాహాయ్యముచేసే మేలైనవరమే తెలివి అనబడును.

గు. భక్తి అనగా నేమి?

శి. జపమునున్ను దేవ సేవసంబంధమైన తక్కిన ఆచారములనున్ను మనకు ఇష్టముగా చేసే మేలైనవరము భక్తి అనబడును.

గు. దేవభయమనగా నేమి?

శి. సర్వేశ్వరుని గురించి స్నేహముతోనున్ను భయముతోనున్ను కలిసిన వినయము మనస్సులోపలనుంచి మనలను సకలకీడులకు భయపడుటకంటే పాపానికి భయపడుతు నడుపజేసే మేలైనవరము దేవభయమును.

గు. భద్రమైన అభ్యాంగము మనలను యుత్తమక్రీస్తువులుగా జేసేదేలాగు?

శి. సత్యవేదమును ధీరత్వముతో చేకొనుటకున్ను దానిలో నిమిడియుండే సత్యాలన్నిటిని దృఢముగా విశ్వసించుటకున్ను అందుకొరకు కావలసిన సమయమందు సాక్ష్యము ఇచ్చుటకున్ను మనలను తగినవారుగా జేసినందువల్లనే.

గు. ఎటువంటి ఆయత్తముతో భద్రమైన అభ్యాంగము పొందవలెను?

శి. జ్ఞానస్నానము పొందేదిగాక సత్యదేవ ప్రధాన పరమరహస్యములను తెలుసకొని దేవయిష్టప్రసాదముతో నుండవలెను. ఇటువంటి ఆయత్తముతో భద్రమైన అభ్యాంగముపొందవలెను.

మూడవ పర్వము.

పశ్చాత్తాపమును గుఱించి.

గు. పశ్చాత్తాపమనగా నేమి?

శి. జ్ఞానస్నానము పొందినతరువాత మనము చేసిన పాపములన్నిఁ విమోచనముచేసే దేవద్రవ్య అనుమానము పశ్చాత్తాపమువును.

గు. పశ్చాత్తాపము స్థాపించినవారెవరు?

శి. జేసుక్రీస్తువే స్థాపించినారు.

గు. జేసునాథుడు ఈదేవద్రివ్య అనుమానము స్థాపించినదేలాగు?

శి. వారు మరణముపొంది తిరుగా జీవనవంతులై లేచినతరువాత మతశిష్యులమధ్య సుదర్శనమై

వారిమీద ఊపిరి విడిచి స్పిరీతుసాంక్తును పొందుదురుగాక మీరెవ్వరి పాపములను క్షమించెదరో వారికి క్షమించ బడుననిన్ని ఎవ్వరిపాపములను క్షమించక యుండెదరో వారికి క్షమించబడక యుండుననిన్ని ఆనతిచ్చినందువల్ల యీ దేవద్రవ్య అనుమానము స్థాపించినారు.

గు. జేసునాథుడు పశ్చాత్తాపముచేత పాపములను క్షమించుట కెవ్వరికి అధికారమిచ్చినారు?

శి. తమ అపోస్తులవారికిన్ని వీరికి బదులుగావచ్చి గురుపట్టము పొందినవారికిన్ని మాత్రము ఇచ్చినారు.

గు. పశ్చాత్తాపము ఎవ్వరికి అవసరమైయున్నది?

శి. జ్ఞానస్నానము తీసినతర్వాత చావైనపాపము చేసినవారందరికి అవసరమైయున్నది.

గు. పశ్చాత్తాపముచేత గలిగే మేలులేవి?

శి. పాపవిమోచనమున్ను సర్వేశ్వరునితో సఖ్యపడడమున్ను పాపముచేత పోగొట్టుకొన్న ఫలములను వల్లీ పొందడమున్ను ఇవి మొదలైన మేలులు పశ్చాత్తాపముచేత కలిగియున్నవి.

గు. పశ్చాత్తాపమనే దేవద్రవ్య అనుమానము ఎన్నిభాగములుగ నున్నది?

శి. నాలుగు భాగములుగానున్నది. అవియేవంటే, ౧-ది మనస్తాపము; ౨-ది పాపసంకీర్తనము; ౩-ది ఉత్తరంపు; ౪-ది పాపనివారణము.

## నాలుగవ పర్వము.

---

### మనస్తాపమును గురించి.

గు. మనస్తాపమనగా నేమి?

శి. సర్వేశ్వరునికి అసహ్యమైయుండే పాపముల ను చేసిందుననిమిత్తమై మనస్సునొచ్చిదుఃఖ పడి యికమీదట ఒక్కనాటికిన్ని ఒక్కపా పమైనను చేసేదిలేదని గట్టిమనస్సుతో ప్రతి జ్ఞ జేయడమే మనస్తాపమవును.

గు. పాపవిమోచనముకొరకు మనస్తాపము అగత్య ముగా కావలసినదా?

శి. మనస్తాపము లేకుండ ఒక్కసారియైనను పా పవిమోచనము కానేరదుగనుక పాపవిమో చనము అయ్యేటందుకు మనస్తాపము అగత్య ముగా కావలసినదే.

గు. నిజమైన మనస్తాపమునకు కావలసిన గుణము లేవి?

శి. అది స్వభావమునకు మించినదై యుండవలెను, మనస్సులోపలిదై యుండవలెను, సకలపాపములకు పాత్రులుగానుండవలెను, సర్వదుఃఖముకన్నను అధికమైయుండవలెను, యీనాలుగు గుణములు కావలసినవి.

గు. మనస్తాపము స్వభావమునకు మించినదై యుండవలెననేటందుకు అర్థమేమి?

శి. మనస్తాపము లౌకికముఖాంతరముచేత రాకుండ స్పిరీతుసాంక్తుచేతనున్ను వేదమునకు చేరిన ముఖాంతరము చేతనున్ను రావలసినదని అర్థమవును.

గు. మనస్తాపము మనస్సు లోపలిదై యుండవలెననేటందుకు అర్థమేమి?

శి. అది వాక్కులోనున్ను బయిట క్రియలోనున్ను కనిపించేది చాలక హృదయములో కలిగి యుండవలెనని అర్థమవును.

గు. మనస్తాపము సకలపాపములకు పాత్రులుగానుండవలెననేటందుకు అర్థమేమి?

శి. మనముచేసిన సకలచాలైన పాపములకొరకై ఆదుఃఖమనస్తాపము పడవలెనని అర్థమవును.

గు. మనస్తాపము సర్వదుఃఖముకన్న అధికమైయుం డవలెననేటందుకు అర్థమేమి?

శి. ప్రపంచ మేలులన్నిటిని పోగొట్టికొనుటవల్ల వచ్చే దుఃఖముకంటె పాపముకొరకు అధికముగా మనస్తాపపడి సకలకీళికన్న పాపము అధికముగా అసహ్యించవలెనని అర్థమవును.

గు. మనస్తాపము ఎన్నివిధములుగా నున్నది?

శి. ఉత్తమ మనస్తాపమని, కొరతగల మనస్తాపమని రెండు విధములుగా నున్నది.

గు. ఉత్తమ మనస్తాపమనగా నేమి?

శి. కడగురుతులేని సకలమేలులు స్వభావముగలిగి మితిలేని స్నేహమునకు పాత్రమైయుండే సర్వేశ్వరునికి ద్రోహము చేసినందు నిమిత్తముగా బహుమనస్సునొచ్చి దుఃఖపడడమే ఉత్తమ మనస్తాపమవును.

గు. ఉత్తమ మనస్తాపముచేత కలిగే మేలులేవి?

శి. పాపసంకీర్తనము చేసులకు నిండు మనస్సుగల పాపాత్ములను పరిశుద్ధపరచుటనున్ను సర్వేశ్వరునితో తక్షణముగా సఖ్యము కావించుటనున్ను ఇవి మొదలైన మేలులు ఉత్తమ మనసాపముచేత కలుగును.

గు. ఉత్తమ మనస్తాపమంత్రము చెప్పు?

శి. ఉత్తమ మనస్తాపమంత్రము.

గు. కొరతగల మనస్తాపమనగా నేమి?

శి. పాపముయొక్క వికారము విచారించిగాని పాపముచేత మోక్షభాగ్యము పోగొట్టికొంటి నామని ఆలోచించిగాని దానివల్ల నిత్యనరక శిక్షలకు పాత్రులైపోయినామని దృష్టించి గ్రహించిగాని పాపముచేసినందు నిమిత్తము గా మనస్సునొచ్చి దుఃఖపడడమే కొరతగల మనస్తాపమవును.

గు. కొరతగల మనస్తాపముచేత కలిగే మేలు లేవి?

శి. పాపపట్టుదలను తొలగదోసివేయుటయున్ను పశ్చాత్తాపముచేత పాపక్షమము పొందుటకు పాపాత్ములను ఆయత్తపరచుటయున్ను ఇవి మొదలైన మేలులు కొరతగల మనస్తాపము చేత కలుగును.

గు. పశ్చాత్తాపముచేత పాపవిమోచనము పొందుటం దుకు కొరతగల మనస్తాపము చాలునా?

శి. దేవస్నేహము యొక్క ఆరంభముతో కూడ నుండేపక్షమందు చాలును.

గు. ప్రతిష్ఠ అనగా నేమి?

శి. ఇకమీదట ఒక్కనాటికిన్ని ఒక్కపాపమైనను చేసేది లేదని గట్టిమనస్సుతో నిశ్చయించుకొటే ప్రతిజ్ఞ అవును.

గు. మంచిప్రతిజ్ఞకు కావలసిన గుణములేవి?

శి. పొత్తులుగా నుండవలెను. స్థిరముగానుండవలెను. ఫలకరముగా నుండవలెను. ఈమూడు గుణములు కావలసినది.

గు. ప్రతిజ్ఞ పొత్తులుగా నుండవలెననేటందుకు అర్థమేమి?

శి. ఇకమీదట సకలమైన పాపములను విడిచిపెట్టి తప్పించుకొనుటకు నిండుమనస్సు గలిగియుండవలెనని అర్థమవును.

గు. ప్రతిజ్ఞ స్థిరముగానుండవలెననుటకు అర్థమేమి?

శి. మళ్లీ పాపము చేయుటకంటె సర్వభాగ్యములను పోగొట్టుకొనుటకున్ను సకలవేదనలను అనుభవించుటకున్ను నిండుమనస్సు కలిగియుండవలెనని అర్థమవును.

గు. ప్రతిజ్ఞ ఫలకరముగా నుండవలెననేటందుకు అర్థమేమి?

శి. పాపము తప్పించుకొనుటకు కావలసినదంతయు చేయుటకు సంపూర్ణమనస్సు కలిగియుండవలెనని అర్థమవును.

## అయిదవ వర్గము.

### పాపసంకీర్తనమును గురించి.

గు. పాపసంకీర్తనమనగా నేమి?

శి. పాపక్షమను పొందేటట్టుగా చేసినపాపముల న్ని గురువుకు తెలియచేయుట పాపసంకీర్తనమవును.

గు. పాపవిమోచనము కొరకు పాపసంకీర్తనముచే నేది అగత్యముగా కావలసినదా?

శి. పాపసంకీర్తనమనేది పాప విమోచన మయ్యే టందుకు జేసునాథునిచేత స్థాపించబడి అపోస్తలవారిచేత బోధించబడి పొరబాటులేని తిరుసభలో ఆచరించుకొని వచ్చేదైయున్నందువల్ల పాపవిమోచనముకొరకు పాపసంకీర్తనము చేసేది అగత్యముగా కావలసిన దే.

గు. జేసునాథుడు ఎప్పుడు పాపసంకీర్తనము స్థాపించినారు?

శి. తమ అపోస్తలకున్ను వారియొక్క స్థానములో పారంపర్యముగా వచ్చే గురువులకున్ను పాపములను క్షమించుటకు అధికార మిచ్చినప్పుడే పాపసంకీర్తనము స్థాపించినారు.

గు. యేసునాథుడు పాపములను క్షమించుటకు తన అపోస్తలులకు అధికారమిచ్చినందువల్ల పాపసంకీర్తనము స్థాపించినారనేటందుకునిశ్చయమేమి?

శి. యేసునాథుడు పాపములను క్షమించుటకున్ను క్షమించక యుండుటకున్ను తన అపోస్తలులకున్ను వారిస్థానములో పారంపర్యముగావచ్చే గురువులకున్ను అధికారమివ్వ నవధరించినందువల్ల పాపములనుక్షమించుటకున్ను క్షమించక యుండుటకున్ను వార్లనున్యాయాధిపతులనుగా నేర్పరిచినారనేటందుకు సందేహము లేదు. అయితే న్యాయాధిపతి నీతిప్రకారము తీర్పుచేయుటకు వ్యవహారమున్ను దాని విశదములనున్ను తెలుసుకోవలసినట్లు న్యాయాధిపతియైన గురువున్ను పొందిన అధికారమువినియోగపరుచుటకువ్యవహారమునకు ఉపమించబడే పాపములనున్ను వాటివిశదములనున్ను తెలుసుకోవలసినది కాబట్టి పాపములను తెలుసుకొని వేటిని క్షమించతగునో వేటిని క్షమించతగదో అనినిర్ణయించుటకు పాపసంకీర్తనముగాక వేరే యుపాయములేనందువల్ల యేసునాథుడు పాపములను క్షమించుటకున్ను క్షమింపక యుండుటకున్ను

అధికారమివ్వనవధరించినప్పుడే పాపసంకీర్త
నము స్థాపించినారని నిశ్చయమే.

గు. ఏసమయములో పాపసంకీర్తనము చేయుటకు పైపైన ఋణమైయున్నది?

శి. ప్రతిసంవత్సరము ఒక్కసారియైనను మరణావస్థ సమయమందున్ను చావైన పాపములోనుండేపక్షమందు సత్ప్రసాదము పొందకమునుపున్ను పాపసంకీర్తనము చేయుటపైపైన ఋణామే. ఇదిగాక తమ ఆత్మరక్షణమును గురించి జాగ్రతగానుండేవార్లు చావైనపాపము చేసినపక్షమందు కూడిన తక్షణమే పాప సంకీర్తనము చేయవలెను.

గు. చావైన పాపముతోనుండేవార్లకు సంభవించే కీళ్లు అపాయములేవి?

శి. చావైన పాపముతోనున్నంతమట్టుకు చేసేజప తప దానధర్మములన్ని మోక్షబహుమానమునకు నిష్ఫలమైయుండేవిగాక దేవకోపమునకున్ను ఆకస్మికమైన చావుకున్ను నిత్యనరక శిక్షకున్ను పాత్రులైయున్నారు.

గు. చావైన పాపముచేసిన పక్షమందు బుద్ధివచ్చిన తక్షణ మేమిచేయవలసినది?

శి. ఇటువంటి భయంకరమైన స్థితిలో నొక్కక్షణ

మైనను నిలువక కావలసిన సమయములో పాపసంకీర్తనము చేయుటకు నిండుమనస్సుతో నిశ్చయించి ఉత్తమ మనస్తాపము పడవలసినది.

గు. చావైన పాపముతో నుండేవారు పాపసంకీర్తనము చేయుటకసాధ్యమైనపక్షమందు పాపవిమోచనము పొందగలరా?

శి. తగినసమయములో పాపసంకీర్తనము చేయుటకు నిండుమనస్సుగానుండేపక్షమందు ఉత్తమమనస్తాపము పడినందువల్ల పాపవిమోచనము పొందగలరనునది నిశ్చయమే.

గు. మంచి పాపసంకీర్తనమునకు కావలసినగుణము లేవి?

శి. దీనత్వముగలదిన్ని, సరళముగలదిన్ని, సంపూర్ణముగలదిన్ని యీమూడుగుణములు కావలసినవి.

గు. పాపసంకీర్తనము దీనత్వమైయుండుటకేమిచేయవలెను?

శి. మితిలేని స్నేహమునకు పాత్రమైయుండే సర్వేశ్వరునికి ద్రోహముచేసినందు నిమిత్తముగా బహుసిగ్గుపడి మహాదీనత్వముతో తనపాపములను బయలుపరచవలెను.

గు. పాపసంకీర్తనము సరళమైయుండుట కేమి చేయవలెను?

శి. చేసినపాపములకు యుక్తి వెతికి సాకు చెప్పకుండ వాస్తవ్యమైనది. వాస్తవ్యప్రకారమే చెప్పవలెను.

గు. పాపసంకీర్తనము సంపూర్ణమైయుండుట కేమి చేయవలెను?

శి. చేసిన సకలపాపములనున్ను పాపములయొక్క విధమునుమార్చే విశేషములనున్ను పాపములయొక్క గొప్పతనము అధికపరిచే విశేషములనున్ను చెప్పవలెను.

గు. ఒక్క ఉదాహరణముచేత దాని అర్థము విశదపరుచు?

శి. దొంగలించినవస్తుమందు దొంగిలినానని చెప్పేదిమాత్రముచాలదు. ఇన్ని మార్లు దొంగిలినానని చెప్పి అల్పవస్తువో ఘనమైనవస్తువో దేవకొలువుకు నియమించబడిన కార్యమో కాదో అని వివరముగా చెప్పవలెను.

గు. పాపసంకీర్తనములో మనఃపూర్వకముగా నేపాకచాపైన పాపమును బయిలుపరచనివాడు పాపక్షమను పొందునా?

శి. తక్కినపాపములన్ని బయిలు పరిచినప్పటికిన్ని ఒక్కచావైనపాపము దాచుకొనేపక్షమందు పాపక్షమము పొందక మహాదేవద్రోహము కట్టుకొనుచున్నాడు.

గు. ఇటువంటి దేవద్రోహముకట్టుకొనినవాడు పాపక్షమము పొందుటకు చేయవలసిన దేమి?

శి. మళ్లీ పాపసంకీర్తనము చేసి మొదట దాచుకొనిన పాపము బైలుపరచి ఆ పాప సంకీర్తనములో చెప్పిన పాపములనున్ను దాని తర్వాత చేసిన పాపములనున్ను చెప్పి పొత్తుపాపసంకీర్తనము చేయవలసినది.

గు. పాపసంకీర్తనములో ఏదొకచావైనపాపము చెప్పమరిచిపోయినవాడు చేయవలసిన దేమి?

శి. తగిన ఆత్మశోధనచేసి చెప్పమరిచిపోయిన పక్షమందు వచ్చే పాపసంకీర్తనములో బైలుపరిస్తే చాలును. తగిన ఆత్మశోధన చేయనందువల్ల నేదొకచావైనపాపము చెప్పమరిచిపోతే మళ్లీ పాపసంకీర్తనము చేయవలసినది.

గు. చేసిన పాపములను సరిగా బైలుపరచుటకు చేయవలసిన దేమి?

శి. పాపసంకీర్తనమునకు మునుపు బహు అవధాన జాగ్రితతో ఆత్మశోధన చేయవలసినది.

గు. మంచి ఆత్మశోధనచేయుట కేమిచేయవలెను?

శి. ఒక్కస్థలములో నేకాంతముగానుండి దేవసాహాయ్యముపార్థించి అడిగి శ్రద్ధగా మనస్సులోపలికి ప్రవేశించి విచారముచేతనున్ను వాక్కుచేతనున్ను క్రియచేతనున్ను చేయమిచేతనున్ను చేసినపాపములను ఆలోచనతో చురుకుగా పరికించి చూడవలసినది.

గు. దేనినిగురించి ఆత్మశోధన చేయవలసినది?

శి. దేవకల్పనలనున్ను తిరుసభ కట్టడలనున్ను తన స్థితి సంబంధమైన ఆప్రైవ ఋణములనున్ను తన దురభ్యాసములనున్ను గురించి ఆత్మశోధన చేయవలసినది?

---

ఆరవ పర్వము.



ఉత్తరించుటను గురించి.

---

గు. ఉత్తరించుట అనగా నేమి?

శి. పాపముచేత సర్వేశ్వరునికి చేసిన ద్రోహాపమును పరిహరించు కే యుత్తరించుటవును.

గు. పాపవిమోచన మయ్యేటందుకు సర్వేశ్వరునికి యుత్తరించుటకు నిండుమనస్సుగా నుండుట అగత్యముగా కావలసినదా?

శి. సర్వేశ్వరునికి యుత్తరించవలెనని దిట్టమనస్సు లేకుండ నొకనాటికిన్ని పాపక్షమము పొందలేనందునల్ల పాపవిమోచన మయ్యేటందుకు ఉత్తరించుటకు నిండుమనస్సుగా నుండుట అగత్యముగా కావలసినదే.

గు. పాపక్షమము పొందినతర్వాత సర్వేశ్వరునికి యుత్తరించవలసినదా?

శి. సర్వేశ్వరుడు పాపమునుక్షమించి దానికి చెల్లిన నిత్యశిక్షను మనము ఈ లోకమందైనను మోక్షలోకమందైనను అనుభవించవలసిన అనిత్యశిక్షగా మార్చినందువల్ల పాపక్షమము పొందినతర్వాత ఉత్తరించవలసినదే.

గు. జేసునాథుడు ఉపదేశించి మరణముపొంది సర్వేశ్వరునికి యుత్తరించియుండగా మనమున్ను ఉత్తరించవలెనని చెప్పేదెందుకు?

శి. జేసునాథుడు పాటుపడి మరణము పొంది సర్వేశ్వరునికి చేసిన పరిహారఫలములు తనన్ను చేయుటకు నిండుమనస్సు గలవారికి మాత్రము ఫలితమయ్యేటందువల్ల అతిరుఫలములు

మున కుఫలించుటకు మనము న్న తపః క్రియల మూలముగా సర్వేశ్వరునికి యుత్తరించవ లెనని చెప్పుటసరి.

గు దేనిమూలముగా పాపపరిహారముచేసి సర్వే శ్వరునికి యుత్తరించవలెను?

శి. గురువు అపరాధముగా కట్టడచేసిన జప తప దానములు మొదలైన పుణ్యక్రియలమూల ముగా విశేషముగా పాపపరిహారము చేసిన సర్వేశ్వరునికి యుత్తరించవలెను.

గు. గురువు అపరాధముగా కట్టడచేసినదంత తీర్చు టకప్పైన ఋణమా?

శి. కూడినవరకు అలసించక అదంత తీర్చుటకప్పై న ఋణమే.

గు. గురువు అపరాధముగా కట్టడచేసిన క్రియలు తీర్చేది క్షమించబడిన పాపములకొరకు స ర్వేశ్వరునికి యుత్తరించుట చాలునా?

శి. అనేకమార్లు చాలమగనుక మరియింక స్వేచ్ఛ గానుండే జప తప దానధర్మములచేతనున్న మన కష్టములన్నిటిని జేసునాథుని కష్టముల తో కలిపి ఓర్పుగా సహించుటచేతనున్న పాపపరిహారముచేసి సర్వేశ్వరునికి యుత్త రించవలసినది.

గు. క్షమించబడిన పాపములనిమిత్తముగా ఈలోకమందు సర్వేశ్వరునికి యుత్తరించనివార్లకేమి సంభవించును?

శి. మరులోకమందు ఉత్తరించే స్థలముయొక్క చెప్పరాని వేదనలచేత నుత్తరించుదురు.

గు. సర్వేశ్వరునికి మాత్రము ఉత్తరించుట చాలునా?

శి. చాలదు. పొరుగువానికిన్ని యుత్తరించవలసినది.

గు. పొరుగువానికి యుత్తరించేదేలాగు?

శి. వాని ఆత్మకున్ను శరీరముకున్ను కీర్తికిన్ని ధనములకున్ను రప్పించిన కొరతలను పరిహారించుటవల్ల నుత రించేది సరే.

## ఏడవ పర్వము.

### పరిపూర్ణ ఫలాసంపూర్ణ ఫలములను గురించి.

గు. మనపాపములకొరకు సర్వేశ్వరునికి యుత్తరించుటకు తిరుసభ మనకు సాహాయ్యముగా స్థాపించిన మూలములేవి?

శి. పరిపూర్ణఫలాసంపూర్ణ ఫలములు.

గు. పరిపూర్ణఫలాసంపూర్ణ ఫలములనగా నేమి?

శి. పాపములు క్షమించబడిన తర్వాత అనుభవించవలసిన అనిత్యశిక్షలయొక్క నివారణమే పరిపూర్ణఫలాసంపూర్ణ ఫలము లనబడును.

గు. అటువంటి నివారణ మేలాగవును?

శి. జేసునాథుని తిరుపాట్లుయొక్క మితిలేని ఫలములున్ను వారి అనుగ్రహామువల్ల దేవమాత మొదలైన అర్చశిష్టవారుచేసిన పుణ్యముల యొక్క మిక్కుటమైన ఫలములున్ను తిరుసభ అధికారముచేత మనకివ్వానవధరించబడినందువల్లనే అటువంటి నివారణమవును.

గు. పరిపూర్ణఫలాసంపూర్ణ ఫలములను పొందుటకు మనము చేయవలసిన దేమి?

శి. అందుకొరకై తిరుసభ నియమించిన సత్క్రియలను విధించిన రీతిప్రకారముగా తీర్చవలసినది.

గు. పరిపూర్ణఫలముకున్ను అసంపూర్ణ ఫలముకున్ను భేద మేమి?

శి. పరిపూర్ణఫలమువల్ల క్షమించబడిన పాపముల నిమిత్తము అనుభవించవలసిన అనిత్య శిక్ష సమస్తముగ నివారణమవును అసంపూర్ణ

ఫలమువల్ల అటువంటి అనిత్యశిక్ష కొంతమ
ట్టుకు మాత్రము నివారణమవును.

గు. ఎందుకు తిరుసభ చేత పరిపూర్ణ ఫలాసంపూర్ణ ఫలముల నివ్వనవధరించబడును?

శి. మనపాపముకొరకు మనము సర్వేశ్వరునికి పూర్ణముగా నుత్తరించచాలనందువల్ల పాపపరిహారము చేసుటకు తిరుసభ చేత నటువంటి సాహాయ్యము మనకివ్వనవధరించబడును.

గు. ఉత్తరించే స్థలములోనుండే ఆత్మలకొరకు పరిపూర్ణ ఫలాసంపూర్ణ ఫలములను మనముపొందవచ్చునా?

శి. తిరుసభ ఆలాగు చేయవచ్చునని శెలవిచ్చినప్పుడు మనము పొందిన పరిపూర్ణ ఫలాసంపూర్ణ ఫలములచేత నుత్తరించే స్థలములోనుండే ఆత్మలకు సహాయముగా నిచ్చేది ధర్మమే.

## ఎనిమిదవ పర్వము.

---

### పాప నివారణమును గురించి.

---

గు. పాప నివారణమనగా నేమి?

శి. గురువు జేసుక్రీస్తునాథునియొద్ద పొందిన అధికా

రముచేత పాపాత్ములకు ఇవ్వ నవధరించే పాపక్షమమే పాపనివారణమవును.

గు. గురువు పాపనివారణము ఇవ్వ నవధరించేదే లాగు?

శి. తగిన ఆయత్తముతో పాపసంకీర్తనము చేసిన పాపాత్ముని తలమీద చెయ్యియుంచి పిత యొక్కనున్ను సుతునియొక్కనున్ను స్పిరీతుసాంక్తుయొక్కనున్ను నామముచేత నేను నీ పాపములను క్షమించుచున్నానని ఆనతిచ్చినందువల్ల పాపనివారణమివ్వ నవధరించుదురు.

గు. గురువు ఇచ్చే పాపనివారణముచేత నిజముగా పాపవిమోచన మవునా?

శి. ఎవ్వరిపాపములను మీరు క్షమించుదురో వారికి క్షమించబడునని జేసునాథుడే గురువులను గురించి అనతిచ్చినందువల్ల గురువు ఇచ్చిన పాపనివారణముచేత నిజముగా పాపవిమోచనమవును.

గు పాపవిమోచనమయ్యేటందుకు గురువు ఇచ్చే పాపనివారణము అగత్యముగా కావలసినదా?

శి. ఎవ్వరి పాపములను క్షమించక ఉండుదురో

వారికి క్షమించబడకయుండునని జేసునాథు
డే గురువులను గురించి ఆనతిచ్చినందువల్ల
పాపవిమోచనమయ్యేటందుకు గురువుఇచ్చే
పాపనివారణము అగత్యముగా కావలసినదే.

గు. గురువు ఇచ్చిన పాపవిమోచనము పాపసంకీ
ర్తనము చేసేవారికందరికి ఫలించునా?

శి. తగిన ఆయత్తముతో పాపసంకీర్తనము చేసే
వారికి మాత్రము ఫలించును.

గు. పశ్చాత్తాపముచేత పాపక్షమను పొందుటకు
చేయవలసినవాటిని సంక్షేపముగా చెప్పు?

శి. విశేషముగా ఆరుకార్యములను చేయవలసిన
ది. అవియేవంటే, ౧-ది చేసినపాపములను
తలంచి చురుకుగా పరీకించుట; ౨-ది పాప
ముచేత సర్వేశ్వరునికిద్రోహముచేసిన నిమి
త్తముగా మనస్సునొచ్చి దుఃఖించుట; ౩-వ
ఇకమీదట ఒకనాటికిన్ని యేపాపముచేసే
దిలేదని స్థిరమైనప్రతిజ్ఞ చేయుట; ౪-ది చేసిన
పాపములన్నిటిని గురువుతో చెప్పుట; ౫-ది
గురువు కట్టడచేసిన అపరాధము తీర్చి సర్వే
శ్వరునికిన్ని పొరుగువానికిన్ని యుత్తరించు
టకు నిండుమనస్సుగా నుండుట; ౬-ది గురు
వువద్ద పాపనివారణము పొందుట.

## తొమ్మిదవ పర్వము.

### పాపసంకీర్తనముచేసే క్రమమైన రీతి.

ప్ర. గురువుదగ్గరవచ్చి పాపసంకీర్తనము ఆరంభించే రీతి యేది?

ఉ. ౧-ది తండ్రీ పాపినైన నాకు ఆశీర్వాద మివ్వండి అని చెప్పినందువల్ల గురువుయొక్క ఆశీర్వాదము అడుగుట. ౨-ది స్లీవగురుతు వేసుకొనుట. 3-ది తలవంచి పాపసంకీర్తన మంత్రముయొక్క మొదటిసగము చెప్పుట. ౪-ది ఎప్పుడుపోయిన పాపసంకీర్తనమైనది చెప్పుట. ౫-ది పోయిన పాపసంకీర్తనము చేసినప్పుడు గురువు పాపక్షమమిచ్చినారో లేదో అని తెలియచేయుట. ౬-ది అప్పుడు గురువు కట్టడచేసిన అపరాధము తీర్చడము అయినదో లేదో అని తెలియచేయుట. ౭-ది పోయిన పాపసంకీర్తనములో నేదొక చావైన పాపము మరిచిపోయిన పక్షమందైనను దాచుకొనిన పక్షమందైనను అదంత సరిగా చెప్పుట. ౮-ది పోయిన పాపసంకీర్తనము చేసినప్పటినుంచి చేసిన పాపములన్ని చెప్పుట.

గు. గురువు ఒద్ద పాపములను బయలుపరిచే విధ మేది?

శి. ఏపాపములు చేసియుండినదనిన్ని ఒకొ్కకపాప మెన్నిమార్లు చేసియుండినదనిన్ని ఒకొ్కక పాపమెంతమంది మొదట చేసియుండినదని న్ని యివి మొదలైన ఘనమైన విశేషము లు చెప్పి తన పాపములన్ని తక్కువ లేకుం డానున్ను హెచ్చువ లేకుండానున్ను బహు దీనత్వముతోనున్ను తగిన మర్యాదతోను న్ను బయలు పరచవలసినది.

గు. చేసిన పాపములు చెప్పినపిమ్మట చెప్పతగిన దేమి?

శి. తండ్రీ యీపాపములన్నిన్ని నేను మరచినపా పములన్నిన్ని మునుపు చేసిన పాపములన్ని న్ని తొప్పుకొని వాటికొరకై సర్వేశ్వరు నిక్షమము ప్రార్థించిఅడుగుచున్నాను. మరి న్ని మీారు దయచేసి మీాకు యుక్తమైనట్టు అపరాధమున్ను పాపనివారణమున్ను నాకి వ్వవలెనని కోరుచున్నాను అని నిండు దీన త్వముతో చెప్పవలసినది.

గు. దానితర్వాత చేయవలసిన దేమి?

శి. ౧-ది తలవంచి రొమ్మును కొట్టుకొని పా

సంకీర్తనమంత్రముయొక్క రెండవ సగము చెప్పుట. ౨-ది గురువు చెప్పినబుద్ధులనున్ను కట్టడచేసిన అపరాధమునున్ను వినయముతో బాగా ఆలకించుట. ౩-ది గురువు పాపనివారణమిచ్చేటప్పుడు చేసిన పాపముల నిమిత్తముగా బహుదుఃఖపడి నిందుమనస్సుతో మనస్తాపమంత్రము చెప్పుట.

---

## ౩డియాత పర్వము.

---

## సత్ప్రసాదమును గురించి.

---

గు. సత్ప్రసాదమనగా నేమి?

శి. గోధుమ అప్పముయొక్క గుణములలోనున్ను ద్రాక్షఫలరసముయొక్క గుణములలోనున్ను జేసునాథస్వామియొక్క తిరు శరీరమునున్ను తిరురక్తమునున్ను తిరుఆత్మనున్ను దేవస్వభావమునున్ను నిజముగా నిమిడ్చుకొని యుండే దేవద్రవ్యఅనుమానము సత్ప్రసాదమవును.

గు. ఆ దేవద్రవ్య అనుమానము స్థాపించినవారెవ్వరు?

శి. జేసుక్రీస్తునాథుచే స్థాపించినారు.

గు. ఎప్పుడు స్థాపించినారు.

శి. వారు పాటు.బడుటకు తొలిదినమైన పెద్ద బేస్త
వారమునందు స్థాపించినారు.

గు. జేసునాథుడు ఇటువంటి అద్భుతమైన దేవద్రి
వ్య అనుమానమేలాగు స్థాపించినారు?

శి. తమశిష్యులతో కడపటరాత్రి భోజనము చేస్తు
ఉండగా అప్పమెత్తి ఆశీర్వదించి వారికి
యిచ్చి మీరు పుచ్చుకొని భక్షించండి యెం
దుకంటే ఇది నాశరీరమేఅనిన్ని తర్వాతద్రా
క్షరసపాత్రమెత్తి ఆశీర్వదించి వారికి యిచ్చి
మీరు పుచ్చుకొని త్రాగండి యెందుకంటే
ఇది నారక్తమే అనిన్ని నన్ను జ్ఞాపకముచే
సుటకు మీరు ఇదిచేయండి అనిన్ని ఆనతి
చ్చినందువల్లనే స్థాపించినారు.

గు. జేసునాథుడు ఇది నాశరీరమే ఇది నారక్తమే
అని పలికినందువల్ల చేసినదేమి?

శి. తమతిరుచేతిలో పట్టుకొనియుండే అప్పమును
న్ను రసమునున్ను తమశరీరముగానున్ను
రక్తముగానున్ను మార్చినారు.

గు. నన్ను జ్ఞాపకముచేసుటకు మీరు ఇదిచేయండి
అని పలికినందువల్ల చేసినదేమి?

శి. మీరు చేసినట్టు పత్ప్రసాదము గలగజేసి దివ్య
పూజచేయుటకున్ను లోకాంత పర్యంతము

ఆ ప్రకారమే చేసేటందుకు గురువులను ఏర్పర్చుటకున్ను అపోస్తలకు కావలసిన అధికారమివ్వనవధరించినారు.

గు. అప్పమనేది జేసునాథుని శరీరమయ్యేటట్టుగానున్ను రసమనేది వారి రక్తమయ్యేటట్టుగానున్ను యెప్పుడు మారిపోవును?

శి. మధ్యపూజలో గురువు జేసునాథునికి బదులుగా అప్పమున్ను రసమున్ను యెత్తి యిది నాశరీరమే యిది నారక్తమే అని దేవవశీకరము చేసేటప్పుడే మారిపోవును.

గు సత్ప్రసాదములో జేసునాథుని శరీర రక్తముతో కూడ అప్పరసస్వభావములు లవలేశమైనను లేవా?

శి. దేవవశీకరముచేత అప్పమంతయు జేసునాథుని శరీరమయ్యేటట్టుగానున్ను రసమంతయువారి రక్తమయ్యేటట్టుగానున్ను అద్భుతముగా మారిపోయినందువల్ల వారిశరీరరక్తములతో కూడ అప్పరసగుణములుగాక వేరేమి లవలేశమైనను లేవు.

గు. అప్పరసగుణములనగా నేమి?

శి. పంచేంద్రియములకు విషయమైన రంగు వాసన

రుచిప్రమాణము మొదలైనవే అప్పరసగుణము లవును.

గు. అప్పముయొక్క గుణములలో జేసునాథుని శరీరముమాత్రమే యుండునా?

శి. వారియొక్క తిరురక్తమున్ను ఆత్మయున్ను దేవస్వభావమున్ను కూడయుండును.

గు. రసముయొక్క గుణములలో జేసునాథుని తిరురక్తముమాత్రమే యుండునా?

శి. వారియొక్క తిరుశరీరమున్ను ఆత్మయున్ను దేవస్వభావమున్ను కూడ యుండును.

గు. గురువు నత్ప్రసాదము విరిచే టప్పుడు జేసునాథుని శరీరము విరవబడునా?

శి. లేదు. నత్ప్రసాదములో జేసునాథస్వామి విరవబడని విధముగానున్నందువల్ల గురువు నత్ప్రసాదము విరిచేటప్పుడు జేసునాథుని శరీరము విరవబడక గుణములుమాత్రము విరుచుదురు.

గు. నత్ప్రసాదము విరవబడినతరువాత జేసునాథస్వామి ఒకొక భాగములో ఉండుదురా?

శి. ఏవ్యత్యాసము లేకుండ పెద్దభాగములో పూర్తిగా నుండినట్టు చిన్నభాగములోనున్ను ఉండుదురు.

గు. ఒకవిధగుణములలో సత్ప్రసాదము పొందేవారికంటె రెండువిధగుణములలో పొందేవారు అధికముగా పొందుదురా?

శి. లేదు. జేసునాథుడు అప్పరసగుణములనే రెండువిధగుణములలో పూర్తిగా నుండినట్టు ఒక్కొక విధగుణములలోనున్ను పూర్తిగా నున్నందువల్ల రెండువిధగుణములలో సత్ప్రసాదము పొందేవారును ఒకవిధగుణములో పొందేవారును లవలేశమైననువ్యత్యాసము లేకుండ సమమైన ఫలము పొందుదురు.

గు. జేసునాథస్వామి సత్ప్రసాదములో వేంచేసియున్నందువల్ల పరలోకమును విడిచిపెట్టి వేంచేతురా?

శి. లేదు. జేసునాథస్వామి పరలోకమును విడిచిపెట్టక పరలోకములోనున్ను సత్ప్రసాదములోనున్ను యేకకాలమందు వేంచేసియుందురు.

గు. ఇదేలాగవును?

శి. సర్వేశ్వరుని సర్వబలిమిచేత నవును.

గు. ఈ సత్యములన్నిటిని దృఢముగా విశ్వసిస్తున్నావా?

శి. జేసుక్రీస్తునాథుడే ఆనతిచ్చినందువల్ల నాకన్ను

ఉతో చూచేదానికంటె దృఢముగా విశ్వసి
స్తున్నాను.

గు. యేసునాథస్వామి యెందునిమిత్తము సత్ప్రసా
దము స్థాపించినారు?

శి. ౧-ది తమమరణమును జ్ఞాపకము చేయించుట
కు; ౨-ది తిరుసభకుతోడుపడుటకు; 3 - ది
మన ఆత్మలకు దివ్యభోజనమయ్యేటందుకు;
౪-ది తమ్ముతాము స్లీవయందు బలిగా నొప్ప
గించి చెల్లించినపూజను లోకాంతపర్యంత
ము తమ తిరుసభలోనే వేళ నడుపుకొని
యుండుటకు స్థాపించినారు.

గు. సత్ప్రసాదము మన ఆత్మకు జ్ఞానభోజనమై
యుండే దేలాగు?

శి. అన్నపానము మనశరీరమునకు సత్తువ రక్షించు
నట్టు సత్ప్రసాదము మనఆత్మకు సత్తువ ర
క్షించేటందువల్ల ఆత్మకు జ్ఞానభోజనమైయు
న్నది.

గు. సత్ప్రసాదము పొందుటకు ఎన్నివిధములైన
ఆయత్తములు కావలెను?

శి. ఆత్మ ఆయత్తమని, శరీర ఆయత్తమని రెండు
విధములైన ఆయత్తములు కావలెను.

గు. ఆత్మ ఆయత్తమనగా నేమి?

శి. పరిశుద్ధతనము దృఢవిశ్వాసము గట్టినమ్మిక చురుకు దేవస్నేహము మనోదీనత్వము మహా కృతజ్ఞత ఇవిమొదలైన పుణ్యములను పొందియుండుటే ఆత్మఆయత్తమవును.

గు. శరీర ఆయత్తమనగా నేమి?

శి. అర్ధరాత్రినుంచి అన్నపానము ఎంతమాత్రమైనను తినకుండనుండి తన పంచేంద్రియములను అణచుచు అవధానవినయముతో నుండుటే శరీర ఆయత్తమవును.

గు. సత్ప్రసాదము పొందేటందువల్ల మనకు కలిగే మేలులేవి?

శి. మనలను జేసునాథునితో నైక్యపరుచుట మన ఆశాపాశములను అడ్డగించుట, మనయొద్ద నుండే వరప్రసాదములనున్ను పుణ్యములనున్ను అభివృద్ధిచేయుట, మనకు నిత్యజీవస్వతంత్రమవుట యిప మొదలైన మేలులు సత్ప్రసాదము పొందినందువల్ల గలిగియుండును.

గు. సత్ప్రసాదము పొందే వారందరికి ఆ మేలులు ప్రాప్తించునా?

శి. తగిన ఆయత్తముతో సత్ప్రసాదము పొందే వారికి మాత్రము ప్రాప్తించును.

గు. అగత్యముగా కావలసిన ఆయత్తము సంక్షేప
ముగా చెప్పు?

శి. ౧-ది ఆత్మ చావైనపాపము లేకుండా నుండుట.
౨-ది అర్ధరాత్రినుంచి యేమితినకుండా
నున్ను యేమీ త్రాగకుండానున్ను పరిపూర్ణ
ఉపవాసముగా నుండుట.

గు. చావైన పాపముతోనుండేవాడు సత్ప్రసాద
ము పొందకమునుపు చేయవలసినదేమి?

శి. చేసిన పాపములనిమిత్తముగా మనస్తాపపడి
మంచిపాపసంకీర్తనము చేసి గురువువద్ద పాప
నివారణము పొందవలసినది.

గు. చావైన పాపముతో సత్ప్రసాదమును పొంద
తెగించేవానికి సంభవించేదేమి?

శి. యూదాసనేవానివలె సత్ప్రసాదమును అవమా
నపరిచి దేవద్రోహము చేసినందువల్ల వాని
వలె దేవశాపములో పొరుకొనును.

గు. సత్ప్రసాదము పొందినతర్వాత చేయవలసిన
దేమి?

శి. ఒక పావుగంటఅయినను బహు అవధానము
తోనున్ను వినయముతోనున్ను భక్తితో
నున్ను జేసునాథస్వామికి ఆరాధనయున్ను
మేలెరిగిన స్తోత్రమున్ను చేసి వారికి తన్ను

తానొప్పగించి వారియొక్క వరప్రసాదము
లను ప్రార్థించి అడగవలసినది.

గు. సత్ప్రసాదము ఏసమయములో విశేషముగా
పొందవలసినది?

శి. ప్రతిసంవత్సరము పాస్కకాలమందున్ను మర
ణావస్థ సమయమందున్ను సత్ప్రసాదము
పొందవలసినది.

గు. సత్ప్రసాదము తరుచుగా పొందుట ప్రయోజ
నమై యుండునా?

శి. సత్ప్రసాదము పొందేటప్పుడెల్ల సకలమేలులకు
ఊటగానుండే జేసునాథస్వామిని పొందేటం
దువల్ల తరుచుగా సత్ప్రసాదము పొందుట
యెంచజాలని ప్రయోజనమై యుండును.

---

పదనొకండవ పర్వము.

---

దివ్యపూజను గురించి.

---

గు. దివ్యపూజ అనగా నేమి?

శి. జేసునాథుడు గురువుయొక్క చేతిక్రియ మూ
లముగా మనకొరకు తమ పితయైన సర్వే

శ్వరునికి తమ్ముతాను అప్పరసగుణములలో బలిగా ఒప్పగించుటే దివ్యపూజఅనబడును.

గు. దివ్యపూజ స్థాపించినవారెవ్వరు?

శి. జేసునాథుడే స్థాపించినారు.

గు. జేసునాథస్వామి యేనిమిత్తముగా దివ్యపూజ ను స్థాపించినారు?

శి. మనరక్షణముకొరకు తమ్ముతాను స్లీవయందు బలిగా ఒప్పగించినందువల్ల చేసిన పూజను లోకాంతపర్యంతము తిరుసభలో జరిగించుటకున్ను దానిమూలముగా గలిగిన పుణ్యాఫలములను మనకు ఫలితముగా జేయుటకున్ను స్థాపించినారు.

గు. స్లీవయందు ఒప్పగించబడిన పూజకున్ను పీఠముయందు చేయబడే సత్ప్రసాదపూజకున్ను భేదము ఉన్నదా?

శి. స్లీవపూజనున్ను సత్ప్రసాదపూజనున్ను చేయుటలో జేసునాథుడే బలియును బలియిచ్చేవారున్ను యుండేటందువల్ల స్లీవపూజలో రక్తముచింది సత్ప్రసాదపూజలో రక్తము చిందకనుండే భేదముగాక మరియొక భేదము లేదు.

గు. పూజ యెవ్వరికి యొప్పగించ బడుచున్నది?

శి. సమస్తమునకు ఆదికారణమైయుండే సర్వేశ్వరునికిమాత్రము ఒప్పగించబడుచున్నది.

గు. అర్చశిష్ట దేవమాతకున్ను తక్కిన అర్చశిష్టమోక్షవాసులకున్ను పూజ ఒప్పగించవచ్చునా?

శి. కూడదు. దేవమాతనున్ను తక్కిన మోక్షవాసులనున్ను తలంచుకొని వారికి యేలినవారు చేసిన సాహాయ్యముల నిమిత్తము స్తోత్రముగా సర్వేశ్వరునికిమాత్రము పూజ ఒప్పగించవచ్చును.

గు. ఎవ్వరికొరకు సర్వేశ్వరునికి పూజ ఒప్పగించవచ్చును?

శి. విశేషముగా తిరుసభలోనుండే విశ్వాసులకొరకున్ను ఉత్తరించే స్థలములోనుండే ఆత్మలకొరకున్ను ఒప్పగించవచ్చును.

గు. తిరుసభ యెందుకొరకుపూజఒప్పగించుచున్నది?

శి. సర్వేశ్వరుని సర్వకర్తృత్వముయొక్క యథార్థము విలసిల్లచేసుటకున్ను వారుమనకివ్వను వధరించిన మేలుతెరిగి వారికి స్తోత్రముచేసుటకున్ను పాపవిమోచనము పొందుటకున్ను ఆత్మశరీరమునకు కావలసిన వరప్రసాదములను ప్రాప్తించుటకున్ను పూజ ఒప్పగించుచున్నది.

---

## పన్నెండవ పర్వము.

### అవస్థ అభ్యాంగమును గురించి.

గు. అవస్థ అభ్యాంగ మనగా నేమి?

శి. వ్యాధిగా నుండేవారియందు మిగిలిన పాపము లకు పరిహారమయ్యేటందుకున్ను వారియొ క్క ఆత్మకున్ను శరీరముకున్ను ఆదరణ అ య్యేటందుకున్ను స్థాపించబడిన దేవద్రవ్య అనుమానము అవస్థ అభ్యాంగమవును.

గు. అవస్థ అభ్యాంగము కాయిలాగా నుండేవారికి కలుగచేసే ప్రయోజన మేమి?

శి. అవస్థ అభ్యాంగము కాయిలాగానుండే వారిని పాపములోనుంచి రక్షించి పిశాచితంత్రము లను జయించుటకున్ను వ్యాధియుపద్రవము లను ఓర్పుతో సహించుటకున్ను కావలసిన ధైర్యమున్ను బలమున్ను రప్పించేదిగాక ఆ త్మమోక్షము పొందుటకున్ను శరీరస్వస్థము అనుకూలమైయుండే పక్షమందు శరీర స్వస్థ మున్ను రప్పించుచున్నది.

గు. అవస్థ అభ్యాంగమిచ్చేదేలాగు?

శి. గురువు కాయిలాగానుండే వాని పంచేంద్రియములమీద మేత్రాణులచేతమంత్రించబడిన తైలము అభ్యాంగముచేసి దానికితగిన కొన్నిజపములు చెప్పినందువల్ల అవస్థ అభ్యాంగమివ్వ బడుచున్నది.

గు. పంచేంద్రియములమీద మంత్రించబడిన తైలము అభ్యాంగముచేసే దెందుకు?

శి. పంచేంద్రియములచేత చేసుకొనిన పాపములు విమోచన మయ్యేటందుకు ఇటువంటి అభ్యాంగము చేయబడుచున్నది.

గు. ఎప్పుడు అవస్థ అభ్యాంగము పొందవలసినది?

శి. మరణావస్థసమయములో కూడినమట్టుకు బుద్ధి తెలివియుండగానే పొందవలసినది.

గు. ఎటువంటి ఆయత్తముతో అవస్థ అభ్యాంగము పొందవలసినది?

శి. విశ్వాసము నమ్మిక దేవస్నేహము ఈ మూడు ప్రధాన పుణ్యములు కలిగియుండి చేసిన పాపముల నిమిత్తముగా మనసునొచ్చి దుఃఖపడి వాటిని పరిహరించుటకు వ్యాధియొక్క యుపద్రవములను మహాఓర్పుతో సహించి దేవ యిష్టమునకు తన్నుతాను బా

త్తిగా ఒప్పగించియుండే ఆ యత్నముతో
అవస్థ అభ్యాంగము పొందవలసినది.

గు. అవస్థ అభ్యాంగము పొందకమునుపు పాపసం
కీర్తనము చేయవలసినదా?

శి. పాపసంకీర్తనము చేయ సాధ్యమైతే చేయువల
సినది అసాధ్యమైతే తన పాపములసమిత్త
ముగా నుత్తమ మనస్తాపపడి పాపసంకీర్తన
ము చేయ నిందుమనస్సుగా నుండవలసినది.

గు. అవస్థ అభ్యాంగము పొందిన తరువాత చేయ
వలసిన దేమి?

శి. సర్వేశ్వరునికి మేలెరిగిన స్తోత్రముచేసి లౌకిక
విచారములను విడిచిపెట్టి శాశ్వతమును
గురించి విచారిస్తు ఉండవలసినది.

గు. అవస్థ అభ్యాంగము అనేకమార్లు పొందవ
చ్చునా?

శి. చావువచ్చేటట్టుగా కఠినముగా కాయిలాపడేట
ప్పుడెల్ల అవస్థ అభ్యాంగము పొందవలెను.



## ఆరవమూడవ పర్వము.

### గురుపట్టమును గురించి.

గు. గురుపట్టణమనగా నేమి?

శి. దివ్యపూజ చేయుటకున్ను దేవద్రవ్యఅనుమానములు నెరవేర్చుటకున్ను స్వతంత్రమిచ్చే దేవద్రవ్యఅనుమానము గురుపట్టణమవును.

గు. ఆదేవద్రవ్య అనుమానము స్థాపించినవారెవరు?

శి. శేసుక్రీస్తునాథుడే స్థాపించినారు.

గు. ఎప్పుడు స్థాపించినారు?

శి. తమ అపోస్తలనున్ను వారియొక్క పట్టములో పారంపర్యముగా వచ్చే వార్లనున్ను తమదిట్టముకొరకు తిరుసభకు కనపడే ప్రిథానులను గానున్ను వేదబోధకులనుగానున్ను గురువులనుగానున్ను యేర్పరచినప్పుడే స్థాపించినారు.

గు. గురుపట్టమిచ్చేటందుకు యెవ్వరికి అధికారము గలదు?

శి. అర్చశిష్ట పాపగు అబ్బగారికిన్ని మొదలైనమేత్రాణులకున్ను మాత్రము కలదు.

గు. మనము అర్చశిష్ట అబ్బగారికిన్ని మేత్రాణులకున్ను గురువులకున్ను ఋణముగా చేయవలసిన దేమి?

శి. అర్చశిష్ట అబ్బగారు మేత్రాణులు గురువులు తిరుసభకు జేసునాథస్వామికి బదులుగా కనుపడే ప్రధానులై యున్నందువల్ల వారిని సన్మానించి వారికిలోపడి వారికొరకు సర్వేశ్వరుని వేడుకోవలసినది.

---

పదునాలుగవ పర్వము.

---

జ్ఞానవివాహామును గురించి.

---

గు. జ్ఞానవివాహా మనగా నేమి?

శి. సంసార్లయ్యేవారికి దేవ ఆశీర్వాదమున్ను వార్లు ధర్మమార్గములో నడుచుటకున్ను తమ బిడ్డలను తగినట్టుగా నడిపించుటకున్ను కావలసిన దేవసహాయమున్ను ఇచ్చే దేవద్రవ్యఅనుమానము జ్ఞానవివాహామవును.

గు. జ్ఞానవివాహామెప్పుడు స్థాపించబడినది?

శి. ఆదికాలమందు సర్వేశ్వరుని చేతనే బంధకమై తరువాత జేసునాథస్వామిచేత దేవద్రవ్యఅనుమానముగా స్థాపించబడినది.

గు. ఎందుకొరకు జ్ఞాన వివాహము స్థాపించబడి నది?

శి. భార్యాభర్తలు ఒకరి కొకరు అనుకూలమై యుండేటందుకున్ను వారిచేత లోకవర్ధనము కున్ను దేవసేవకున్ను తగిన సంతతి అభివృద్ధి అయ్యేటందుకున్ను స్థాపించబడినది.

గు. జ్ఞాన వివాహమనే దేవద్రివ్య అనుమానము పొందేవారందరు దానివల్ల కలిగే మేలులను పొందుదురా?

శి. ఇటువంటి దేవద్రివ్య అనుమానము తగిన ఆ యత్నముతో పొందేవాన్లమాత్రము దాని వల్లగలిగే మేలులను పొందుదురు.

గు. ఎటువంటి ఆయత్నముతో జ్ఞాన వివాహము పొందవలెను?

శి. ౧-ది ఆత్మ చావైన పాపములేకుండ అగత్యముగా శుద్ధమై యుండవలసినది; ౨-ది సంసారస్థితిలో సర్వేశ్వరునికి సేవ చేయవలెననిన్ని మహాప్రామాణికముగా నడవవలెననిన్ని నిండుమనస్సుగా భక్తితోనున్ను పరిశుద్ధతాత్పర్యముతోనున్ను ఆదేవద్రవ్యఅనుమానము పొందవలసినది; ౩-ది జప తప

దానధర్మములచేత సర్వేశ్వరుని అనుగ్రహ
ము అడుగవలసినది.

గు. సంసార్లయొక్క ఋణధర్మము లేవి?

శి. ౧-ది భార్యాభర్తలు అన్యోన్యముగా స్నే
హించి కాపాడి ఆదరించుట; ౨-ది ఒకరి
కొకరు ద్రోహముచేయక ప్రామాణికము
గా నుండుట; 3-ది తమగుణములలోని కొ
రతలు ఒకరి కొకరికి క్షమించి యెడబాయక
నిత్యసమాధానమై యుండుట; ౪-ది తమబి
డ్డలను పెంచి కాపాడి వేదముప్రకారముగా
నడిపించుట.

గు. అనేక సంసార్లకు దేవకోపమున్ను పరిపరి
దౌర్భాగ్యములున్ను వచ్చేదానికి కారణమేమి?

శి. పాపములో జ్ఞానవివాహము పొంది దేవద్రో
హము చేయుటనున్ను మీద చెప్పిన ఋణధ
ర్మములు అనుసరించకపోవుటనున్ను దానికి
కారణము.

సమాప్తము.

## కొన్ని పాపములనున్ను పుణ్యములనున్ను గురించి వివరము.

గు. ప్రతిహింసకోరుతు పరలోకమువరకు మొరబెట్టుపాపములెన్ని?

శి. నాలుగు. అవి యేమంటే మొదటిది, కావలెనని నరహత్య చేయుట రెండవది, స్వభావమునకు అసహ్యమైన మహాపాపము చేయుట. మూడవది, పరదేశులనున్ను విధవలనున్ను తల్లిదండ్రులులేని బిడ్డలనున్ను బాధించుట. నాలుగవది, పనిచేసినవారికి కూలి యివ్వకపోవుట.

గు. సన్మార్గసంబంధమైన ప్రధానపుణ్యములెన్ని?

శి. నాలుగు. వివేకము, నీతి, మనోదిట్టము, మితభోజనము.

గు. ప్రధానసత్క్రియలెన్ని?

శి. మూడు. దానము, జపము, ఉపవాసము.

గు. సువిశేషములో శ్లాఘించబడే సద్బుద్ధులెన్ని?

శి. మూడు. స్వేచ్ఛగానుండే దరిద్రము, ఎడతెగని విరక్తత్వము, సంపూర్ణమైన విధేయత.

గు. శరీరసంబంధమైన ధర్మక్రియలెన్ని?

శి. ఏడు. ఆకలిగొనినవారికి అన్నము పెట్టుట. దా

హాముగానుండేవారికి దాహమున కిచ్చుట. వస్త్రిము లేనివారికి వస్త్రిములు ఇచ్చుట. ఇల్లులేనివారికి యిల్లిచ్చుట. బందేఖానాలో నుండేవారిని న్ని వ్యాధిగలవారిని న్ని దర్శించుట. అడిమెలను విడుదలచేయుట. చని పోయినవారిని యెత్తి భూస్థాపనము చేయుట.

౫. ఆత్మసంబంధమైన ధర్మక్రియ లెన్ని?

ఉ. ఏడు. సందేహించేవార్లకు బుద్ధిచెప్పుట, వేద సత్యములను యెరగనివార్లకు నేర్పించుట, పాపాత్ములను తిప్పుట, దుఃఖపడే వార్లకు ఉపశమనము చెప్పుట, నిందలను క్షమించుట, కీళ్లను ఓర్పుతో సహించుట, జీవించే వార్లకొరకున్ను మృతి బొందిన వార్లకొరకున్ను సర్వేశ్వరుని వేడుకొనుట.

సర్వేశ్వరునికి స్తోత్రము.



# జ్ఞానోపదేశము యొక్క యుపభాగము.

పతితులను ఖండించుటకు తగిన న్యాయములు.

---

మొదటి పాఠము.

## అర్చిశిష్ట దేవమాత మొదలైన అర్చిశిష్టవారి వందన వివరము.

గు. దేవమాత మొదలైన అర్చిశిష్టవారు దేవులని తిరుసభ తెంచునా?

శి. ఎంతమాత్రిము కాదు. ఎవ్వారిచేత సృష్టించ బడక నిత్యమైనవారున్ను సమస్తమునకున్ను యేలినవారునై త్రిత్వ యేకసర్వేశ్వరుడొక్కరుమాత్రిమే దేవుడనిన్ని అర్చిశిష్టవారు అతనిచేత సృష్టించబడి రక్షించబడి యిష్టప్రసాదమువల్ల అలంకరించబడి మోక్షానందమహిమకు ఏర్పరచబడి యున్నారనిన్ని తిరుసభ యెంచునుగాని మరియొక ప్రికారముకాదు.

గు. అర్చ్యశిష్ట దేవమాతమొదలైన అర్చ్యశిష్టవారు మనలను రక్షించగలరా?

శి. తమస్వంత బలముచేత మనలను రక్షించలేరు గాని వారు మనకొరకు సర్వేశ్వరుని వేడుకొని వారియొక్క దయా రక్షణము తక్కిన సకలమేలులు మనకు ప్రాప్తింపఁజేయఁగలరు.

గు. దేవమాతనున్ను నమ్మ[illegible] వార్లనున్ను వందిం[illegible]

శి. వారు సర్వేశ్వరునికి [illegible] వారున్న వారియొద్ద అనంత [illegible]హిమను స్వతంత్రముచేత పొందినవారున్ను మనకు ఉపకారివారున్ను పుణ్యములోనున్న స్థితిలోనున్న మిక్కిలి గొప్పవారునై యుండేటందువల్ల వారిని వందించుట న్యాయమే

గు. వార్లను వందించవద్దని వేదములో నిషేధించి యున్నదా?

శి. ఎంతమాత్రము లేదు. సర్వేశ్వరునికి మాత్రము తగిన ఆరాధన వార్లకు చేయుట వేదములో నిషేధించినదిగాని వార్లకు తగిన వందనము చేయుట నిషేధించినది లేదు.

గు. తిరుసభ సర్వేశ్వరునికి చేసే వందనమునకున్ను అర్చ్యశిష్ట దేవమాత మొదలైన అర్చ్యశిష్టవా

ర్లకు చేసే వందనమునకున్ను వ్యత్యాసము న్నదా?

శి. చాలా వ్యత్యాసమున్నది.

గు. సర్వేశ్వరునికి చేయబడే వందనమేమి?

శి. పూజ, బలి మొదలైన దేవ ఆరాధనలు.

గు. దేవ ఆరాధన అర్చశిష్ట దేవమాత మొదలైన అర్చశిష్టవారికి చెల్లునా?

శి. అది సమస్తమును సృష్టించి కాపాడి నాశము చేయుటకు శక్తిగల సర్వేశ్వరుని ఒకరికిమాత్రమే చెల్లునుగాని మరియొకరికి చెల్లదు. అయినప్పటికిన్ని దివ్యపూజ దేవమాత మొదలైన అర్చశిష్టవారిని గురించి సర్వేశ్వరునికి చెల్లించవచ్చును.

గు. తిరుసభ అర్చశిష్ట దేవమాతకు చేసే వందనమేమి?

శి. దేవ ఆరాధనతప్ప సకల అర్చశిష్టవారికి చేయబడే వందనముకంటె మేలైన వందనమవును. ఏలాగంటే ఆతిరునాయకి సకల సృష్టులలో మేలైయుండుటవల్లనున్ను అవతరించిన దేవసుతుని కన్నతల్లియై యుండుటవల్లనున్ను పుణ్యములో సకల అర్చశిష్టవార్లను మించి యుండుటవల్లనున్ను పరలోక భూ

లోక రాణిగారుగా నేర్పర్చబడి యున్నందును వల్లనున్ను.

గు. తిరుసభ అర్చశిష్టవార్లకు చేసేవందనమేమి?

శి. ఈ భూలోకమందుండే గొప్ప వార్లకు చెల్లిన సన్మానముకంటె మేలైనదిన్ని వేదమునకు అంటుకొనేదినై న వందనమవును.

గు. అర్చశిష్టవార్లను వేడుకొనేటందుకు న్యాయ మేమి?

శి. వేదములో విధించబడే సుకృతచట్టము చొప్పున ఈలోకమందుండే విశ్వాసులు ఒకరొకరి కొరకు వేడుకొనేది మేలున్ను సాహాయ్యమై యుండేదానికంటె సర్వేశ్వరుని ప్రత్యక్ష దర్శనమును పొందినవార్లనున్ను వారికిమిక్కిలిప్రియమైనవార్లనున్ను పరిశుద్ధవార్లునై యుండే అర్చశిష్టవార్లనున్ను వేడుకొనేది అధికమేలున్ను సాహాయ్యమున్ను ఉత్తమమునై యుండుటే న్యాయము.

గు. అయితే తిరుసభ సర్వేశ్వరునిన్ని అర్చశిష్ట వార్లనున్ను ఒక్కే విధముగా వేడుకొనునా?

శి. లేదు.

గు. సర్వేశ్వరుని వేడుకొనేరీతి యేలాగు?

శి. వారు కర్తలున్ను రక్షకులున్నై యున్నందున వారికి దేవయిష్టప్రసాద పాపక్షమరక్షణము మొదలైన మేలులు అడుగుచు మాకుదయ చేసి రక్షించండి స్వామీ అనుచున్నాము.

గు. దేవమాత మొదలైన అర్చిశిష్టవార్లను వేడు కొనేరీతి యేలాగు?

శి. మనకొరకు సర్వేశ్వరుని వేడుకోవలెనని వార్లను చూచి మాకొరకు వేడుకొండి అనుచున్నాము.

గు. అర్చిశిష్టవార్లు మనప్రార్థనలను యెరుగుదురా?

శి. ఎరుగుదురనేటందుకు సందేహము లేదు. వార్లు వాటిని మనకావలియైన సమ్మనస్సుల మూలముగానున్ను సర్వేశ్వరునియొక్క ప్రత్యక్ష దర్శనముద్వారానున్ను యివి మొదలైనవిధ ములుగానున్ను యెరుగవచ్చును. తపస్సుచే సేయొకపాపినిగురించి మోక్షములో సంతో షముగలుగునని జేసునాథుడుఆనతిచ్చినారే అలాగు అర్చిశిష్టవార్లు పాపులయొక్క తప స్సు యెరిగి ఉండగా మనప్రార్థనలను మాత్ర మెరుగకనుందురా.

---

రెండవ పాఠము.

## స్వరూపవందన వివరము.

గు. తిరుస్వరూపములు పటములు అర్చశిష్టవస్తువు అనబడేదేమి?

శి. జేసునాథునిన్ని అర్చశిష్ట దేవమాత మొదలైన అర్చశిష్టవారినిన్ని మనకు జ్ఞాపకము పుట్టించే స్వరూపములు పటములు వారిసంబంధమైన అర్చశిష్టవస్తువులు మొదలయినవి.

గు. స్వరూపములను చేయవద్దని సర్వేశ్వరుడు నిషేధించలేదా?

శి. అజ్ఞానులు చేసినట్లు అబద్ధమైన దేవుండ్లుగానున్ను వార్ల గురుతులుగానున్ను విగ్రహముల ను చేయుటనున్ను ఆరాధించనున్ను మాత్రము సర్వేశ్వరుడు నిషేధించి తిరుస్వరూపములను చేయుటవీరే విధించినారు.

గు. జేసునాథుని దేవమాత అర్చశిష్టవారల ఏదొక ప్రాణగుణమైనను తిరుస్వరూపముల యందు కలిగియుండునా?

శి. లేదు. తిరుస్వరూపములు జేసునాథునికిన్ని దేవమాతమొదలైన అర్చశిష్టవారికిన్ని గురుతులై యుండుటగాక మరియొకటి కాదు.

గు. అలాగుండగా తిరుస్వరూపముల యెదట వేడు
కొనుట ఎందుకు?

శి. అవి జేసునాథునిన్ని మోక్షవాసులనున్ను రూ
పుగా చూపించేటట్టు జ్ఞాపకపరిచినందువల్ల
అధిక భక్తి మనోయోగ అవధానముతో వే
డుకొనేటందుకు వాటియెదుట ప్రార్థించుట
యుక్తమైన ఆచారమవును.

గు. అలాగు స్వరూపములయెదుట ప్రార్థించేటప్పు
డున్ను మొక్కి వందనము చేసేటప్పుడున్ను
ఆజపస్తోత్రవందనము స్వరూపములకు చే
యుటకాదా?

శి. ఎంతమాత్రముకాదు. ఆజపస్తోత్ర వందనమంత
స్వరూపములచేత కనపరచబడే జేసునాథు
నికిన్ని అర్చశిష్టవార్లకున్ను చేయుబడివార్ల
కు చేరేదిగాని స్వరూపములలో నిలవదు.

గు. అలాగునుండగా తిరుస్వరూపములకు వందన
ము చేయుట న్యాయమా?

శి. అవి వేదసంబంధమున్ను జేసునాథునికిన్ని అర్చ
శిష్టవారికిన్ని గురుతులున్నై యున్నందుచే
తనున్ను స్వరూపములకు చేయుబడే వందన
మున్ను అవమానమున్ను వాటివల్ల కనపర
చబడేవారికి చేయుబడునదిగా నున్నందుచేత

నున్ను వాటిని పైచెప్పినలాగు వందనము చేయుట న్యాయమైన ఆచారమే. మరిన్ని సర్వేశ్వరుడే అనేకమార్లు గొప్ప అద్భుతము లచేత స్వరూపములను ముఖ్యపరచినారు.

గు. అదిగాక తిరుస్వరూపములచేత వచ్చేజ్ఞాన ప్రయోజనమేమి?

శి. జేసునాథునిన్ని దేవమాతనున్ను తక్కిన మోక్షవాసులనున్ను వారియొక్క సుకృతమాతృకలనున్ను ఆనందమహిమనున్ను మనకు జ్ఞాపకపరిచినందువల్ల అవి దేవభక్తి చురుకు మోక్షపు ఆశ మొదలయిన సుకృతవట్టుదలను మనయందు పుట్టించి పెంచుట మనకు మహాప్రయోజనమే. అందుకొరకువిశేషముగా వాటిని మంత్రించుట సత్యవేదాచారమై యున్నది.



# తిరుమంత్రములు.

## స్లీవగురుతు మంత్రము.

అర్చశిష్ట స్లీవయొక్క గురుతుచేత మాయొక్క శత్రువులనుంచి మమ్మురక్షించండి మాయొక్క సర్వేశ్వరా పితయొక్కనున్ను సుతునియొక్కనున్ను స్పిరీతుసాంక్తుయొక్కనున్ను నామముచేత.

## సర్వేశ్వరునియొక్క ఆరులక్షణములు.

౧-ది సర్వేశ్వరుడు తానైయున్నారు. ౨-ది అనాదిగానున్నారు. ౩-ది శరీరములేక ఉన్నారు. ౪-ది కడగురుతులేని సకల మేలుల స్వభావముగానున్నారు. ౫-ది ఎందున్ను వ్యాపించియున్నారు. ౬-ది అంతటికిన్ని ఆదికారణమైయున్నారు.

## ప్రధాన పుణ్యక్రియలు.

## విశ్వాసముక్రియ.

నాసర్వేశ్వరా స్వామీ తిరుసభ విశ్వాసించి చది

వించే సత్యములన్నిటిని సత్యస్వరూపిగానుండే దేవరవారు తామే తెలియచేసినందువల్ల నేనున్ను దృఢముగా విశ్వసిస్తున్నాను. ఆమెన్ జేసు.

---

నమ్మికక్రియ.

---

నాసర్వేశ్వరా స్వామీ సర్వ నమ్మికమునకు పాత్రముగానుండే దేవరవారు వాగ్దత్తము చేసినందువల్ల. జేసునాథస్వామి పాటుపడిన పుణ్యఫలములను చూచి నాపాపములన్ని ఓర్చి నాకు మీయొక్క వరప్రసాదములనున్ను మోక్షభాగ్యమునున్ను కృపచేతురని దృఢముగా నమ్మియున్నాను.

ఆమెన్ జేసు.

---

దేవస్నేహక్రియ.

---

నాసర్వేశ్వరా స్వామీ. సకలమేలుల స్వభావముగానుండే దేవరవారు మట్టులేని స్నేహమునకు పాత్రముగానున్నందువల్ల అంతటికన్న మిమ్ము నేను నిండుమనస్సుతో స్నేహించియున్నాను. మరిన్ని మిమ్ము గురించి నన్ను నేను స్నేహించే ప్రకారము సమస్తజనులను స్నేహించుచున్నాను. ఆమెన్ జేసు.

## జ్యోతిశ్చక్రమంత్రము.

జ్యోతిశ్చక్రాలయందుండేటి మాయొక్క తండ్రీ! మీనామము అర్చింపబడునుగాక. మీరాజ్యము వచ్చునుగాక. మీచిత్తము జ్యోతిశ్చక్రమందు చేయబడినట్టు భూమియందున్ను చేయబడునుగాక. నానాటికి కావలసిన మా యన్నము మాకు నేటికి య్యండి. మా యప్పులవారికి మేము ఓర్చినట్లు మా యప్పులను మీరు ఓర్వండి. మేము శోధనయందు ప్రవేశించకుండ కీడులోనుంచి మమ్ము రక్షించుకొనండి. ఆమెన్ జేసు.

## ప్రియదత్తమంత్రము.

---

ప్రియదత్తముచేత నిండిన మరియమ్మా పరిగ్రాస్వామి మీయందు స్త్రీలలోపల ఆశీర్వాదింపబడ్డవారు మీరే మీయుదరఫలమనేటి జేసు ఆశీర్వాదింపబడ్డవారప్పనే అర్చశిష్టమరియమ్మా సర్వేశ్వరుని యొక్క మాతా పాపాత్ములమైయుండేటి మాకొరకుగాను ఇప్పుడున్ను మామరణ సమయమందున్ను ప్రార్థించుకొనండి. ఆమెన్ జేసు.

---

## విశ్వాసమంత్రము.

జ్యోతిశ్చక్రమున్ను భూలోకమున్ను సృష్టించిన సర్వవల్లభుడైన పితయైన సర్వేశ్వరుని అంతఃయోగ్యభక్తిచేత విశ్వసిస్తున్నాను. ఆతనియొక్క యేక సుతుడైన మనయొక్క నాథుడైన జేసు క్రీస్తును అంతఃయోగ్యభక్తిచేత విశ్వసిస్తున్నాను. ఇతడు స్పిరీతుసాంక్తువల్ల గర్భమైయుద్భవించి కన్య మరియమ్మనుంచి పుట్టినారు పోంచుపిలాతుకింద ఉపద్రవపడి స్లీవయందు మొలనుకొని కొట్టబడిమరణముపొంది సమాధిలో స్థాపించబడినారు. పాతాళోమునకు దిగి మూడవనాడు మృతమైనవారిలోనుంచి లేచినారు. జ్యోతిశ్చక్రాలకు వేంచేసి సర్వవల్లభుడైన పితయైన సర్వేశ్వరుని కుడిపార్శ్వాన కూర్చున్నారు. అటునుంచి బ్రతికిన వార్లకున్ను చచ్చినవార్లకున్ను న్యాయనిర్ణయము చేయవత్తురు. స్పిరీతుసాంక్తువును అంతఃయోగ్యభక్తిచేత విశ్వసిస్తున్నాను. పొత్తులుగానుండేటి అర్చశిష్టసభ అర్చశిష్ట వార్లయొక్క సముదితప్రయోజనాన్ని విశ్వసిస్తున్నాను. పాపక్షయాన్ని విశ్వసిస్తున్నాను. మాంసఉత్థానాన్ని విశ్వసిస్తున్నాను. సతతమైన జీవాన్ని విశ్వసిస్తున్నాను. —— అమెన్ జేసు.

## పది కల్పనలు.

---

సర్వేశ్వరుడు మనకానతిచ్చిన వేదకల్పనలుపది. అందులో మొదటిది సర్వేశ్వరుని యొక్కరికి మాత్రము ఆరాధన చేతువుగాక. ౨-ది సర్వేశ్వరుని యొక్క తిరునామము వ్యర్థముగా స్వీకరింపక ఉందువుగాక. ౩-ది సర్వేశ్వరునియొక్క యుత్సవ దివసములు ఆచరించ తలంపుదువుగాక. ౪-ది తల్లిదండ్రులను బహుమానముగా నడుపుదువుగాక. ౫-ది నరహత్య చేయక ఉందువుగాక. ౬-ది మోహా అగమ్యాగమనము చేయక ఉందువుగాక. ౭-ది దొంగిలించక ఉందువుగాక. ౮-ది దబ్బరసాక్షి పలకక ఉందువుగాక. ౯-ది పరదారాన్ని అపేక్షించక ఉందువుగాక. ౧౦-ది పరులసొమ్ములను ఆశించక ఉందువుగాక. ఈ పదికల్పనలున్ను రెండు కల్పనలలో అణుగుచున్నవి. అందులో మొదటిది సకల వస్తువులమీద పెట్టినపక్షానికన్న సర్వేశ్వరునిమీద అధిక భక్తి కలిగి ఉందువుగాక. రెండవది తన్ను తాను స్నేహించినట్టు సమస్త జనులను స్నేహించియుందువుగాక. ఆమెన్ జేసు.

## తిరుసభకట్టడలు.

తిరుసభకట్టడ చేసిన కట్టడలుఅయిదు. అందులో మొదటిది ఆదివారము అప్పుపండగ ఆశ్రియించి నిందుపూజకనుట. రెండవది యేడాదికి యొక్కసారి యైనను పాపసంకీర్తనముచేయుట మూడవది పాస్క పండుగలో సత్ప్రిసాదానికి ఆయత్తముగానుండుట. నాలుగవది శుక్రివారము శనివారము మాంసవర్జిత ముగానుండి తిరునభకట్టడ చేసినదినములలో నొక్క ప్రొద్దుగానుండుట. అయిదవది తిరుసభ నడిచేవర సలోనున్ను తగినప్రాయములోనున్ను వివాహము తప్పకొనుట. ఈకల్పనలలో నొక్కకల్పనైనను మీరినవాడు కల్పనలన్ని మీరుచున్నాడు.

ఆమెన్ జేసు.

## పాపసంకీర్తనమంత్రము.

---

సర్వవల్లభులైన సర్వేశ్వరునితోనున్ను యెప్పుడున్ను కన్యకగానుండేటి ముక్తిబొందిన అర్చశిష్ట మరియమ్మతోనున్ను ప్రధానసమ్మనస్సుగానుండేటి మోక్షభాగ్యవంతులయిన మికేలుతోనున్ను స్నాపకులయి యుండేటి మోక్షభాగ్యవంతులయిన

అగుశ్టప్పతోనున్ను అర్చశిష్ట అపోస్తులైన రాయప్ప తోనున్ను చిన్నప్పతోనున్ను సకల అర్చశిష్టవార్ల తోనున్ను నాకు గురువులై యుండేటి మీతోను న్ను పాపసంకీర్తనము చేస్తున్నాను. ఏలనంటే వి చారముచేతనున్ను వాక్కుచేతనున్ను క్రియలచేత నున్ను బహుపాపములు చేస్తిని. నామీద తప్పు నామీదతప్పు నామీదదొడ్డతప్పు. అందుచేత నెప్పు డున్ను కన్యకగానుండేటి ముక్తిబొందిన అర్చశిష్ట మరియమ్మనున్ను ప్రధాన సమ్మనస్సుగా నుండేటి మోక్షభాగ్యవంతులైన మిం కేలునున్ను స్నావకులై యుండేటి మోక్షభాగ్యవంతులైన అరుశప్పనున్ను అర్చశిష్ట అపోస్తులైన రాయప్పనున్ను చిన్నప్పనున్ను సకల అర్చశిష్టవార్లనున్ను నాకు గురువులై యుండేటి మిమ్మునున్ను మనకు కర్తలై యుండేటి సర్వేశ్వరుని నాకొరకై వేడుకొమ్మని వేడుకొను చున్నాను. ఆమెన్ జేసు.

---

### ఉత్తమమనస్తాపమంత్రము.

సర్వేశ్వరా స్వామి దేవరవారు కడగురుతు లేని సకల మేలుల స్వభావముగా నుండేటందువల్ల అంతటికన్న మిమ్ము నేను స్నేహించి యున్నాను. స్వామీ మీకు పొందని పాపాలను నేను చేసినందు

వల్ల మహాయనస్తాపముగానున్నాను. స్వామీ మహా దఃఖముగా నున్నాను. స్వామీ మహాయుత్తమమ నస్తాపముగా నున్నాను. స్వామీయికమీదట ఇంక ఒక్కనాటికిన్ని యిటువంటి పాపములను చేసేదిలేద ని గట్టి మనస్సుతో ప్రతిజ్ఞ చేస్తున్నాను. స్వామీ జే మనాథస్వామి పాటుపడి చిందబోసిన తిరురక్తఫలా లు చూచి నాపాపాలన్ని ఓర్చి నాకు మోక్షభాగ్య మిత్తురని గట్టిగా నమ్మియున్నాను. స్వామీ తిరు సభవిశ్వసించి యుపదేశించే దంతాను తప్పులేని స త్యస్వరూపిగానుండేటి సర్వేశ్వరుడు మనకానతిచ్చి నందువల్ల అనుమానము లేక పరిపూర్ణవిశ్వాసము తో నిండు మనస్సుతో నిశ్చయిస్తున్నాను స్వామీ.

ఆమేన్ జేసు.

## త్రికాలజలము.

ఏలినవారియొక్క సమ్మనస్సు మరియమ్మతో విశేషము చెప్పెను. ఆయమ్మ స్పిరీతుసాంక్తువల్ల గ ర్భము ధరించినారు. ప్రియదత్తమంత్రము.

ఇదుగో యేలినవారియొక్క దాసిరాలను మీ రు మందలించిన మాటచొప్పున నాకు కానియన్నా రు. ప్రియదత్తమంత్రము.

నుతుడైన సర్వేశ్వరుడు మనుష్యావతారము చేసి మనతో కూడ వాసమైయున్నారు.

ప్రియదత్తమంత్రము.

## ప్రార్థించుదము.

సర్వేశ్వరా స్వామీ నమ్మ నన్ను చెప్పినందువల్ల మీకు బిడ్డగానుండే జేసుక్రీస్తు మనుష్యుడయినది తెలుసుకొంటిమే వారియొక్క పాట్లవల్లనున్ను స్లీవవల్లనున్ను యుత్థానముయొక్క మహిమను మేము పొందేటట్టుగా మాకు అనుగ్రహము చేయునవధరింపవలెనని దేవర వారిని వేడుకొంచున్నాము. ఈ వేడుదలనంత జేసునాథస్వామియొక్క తిరుముఖమును జూచి మాకు దయచేయుండి.

ఆమెన్ జేసు.

## కృపదయామంత్రము.

కృపదయాపాణికి మాతయైయుండేటిరాజ్ఞీ వర్థిల్లా మాయొక్క జీవమా మాయొక్క మధురమా మాయొక్క శరణమా వర్థిల్లా.

మేము పరదేశులమైయుండేటి హేవయొక్క బిడ్డలము. మిమ్ము చూచి కూస్తున్నారము.

ఈకన్నీరు కనమయందు ప్రలాపించి యేడుపులై మీకే నిట్టూర్పు విడుచుచున్నాము. అయినందువల్ల మాశరణమా మీయొక్క దయాపము కలిగిన తిరు కన్నులను మామీదతిప్ప నవధరించండి.

ఇదిగాక యీపరదేశము గడిచిన తరువాత మీతిరు ఉదర ఆశీర్వదింపబడ్డ ఫలమైన జేసునాథ స్వామియొక్క ప్రత్యక్షమైన దర్శనము నివ్వనవధ రించండి.

కృపకలిగిన మరియమ్మా.

దయాపము గలిగిన మరియమ్మా.

మధుర కన్యమరియమ్మా.

మేమున్ను జేసుక్రీస్తుయొక్క తిరువాగ్దత్తముల కు పాత్రులై యుండేటట్టుగాను.

సర్వేశ్వరునియొక్క పరిశుద్ధమాతా నూకొరకు గాను వేడుకొన నవధరించండి.

ప్రార్థించుదము.

సర్వశక్తిగల నిత్యసర్వేశ్వరా ముక్తి పొందిన కన్యతల్లియైన మరియమ్మయొక్క ఆత్మనున్ను శరీ రమునున్ను స్పిరీతుసాంతు సహాకరియైయుండగా

దేవరవారియొక్క తిరుకుమారునికి యోగ్యమైన వాసమయ్యేటట్టుగా అమరించితిరే అటువంటి దివ్య తల్లిని తలంచి సంతోషించే మేము ఆమెయొక్క కనికరమైన వేడుదలచేత ఇప్పటి కీడ్లలోనుంచిన్ని నిత్యమరణములోనుంచిన్ని రక్షించబడేటట్టుగా కృపచేయనవధరించండి. ఈవేడుదలనంత మాయేలిన వారైన జేసునాథస్వామియొక్క తిరుముఖమును చూచి మాకు దయచేయండి.

ఆమెన్ జేసు.

---

ఏదొక్కపని చేయకమునుపు ప్రార్థించుట.

సర్వేశ్వరా స్వామీ నేను చేయబోయేపని జేసునాథస్వామియొక్క క్రియల పుణ్యఫలములతో కలిపి మీకు సెప్పగిస్తున్నాను. దానికి మీ ఆశీర్వాదమివ్వనవధరించండి.

పితయొక్కనున్ను సుతునియొక్కనున్ను స్పిరీతుసాంక్తుయొక్కనున్ను నామముచేత

ఆమెన్ జేసు.

---

భోజనము చేయకమునుపు
ప్రార్థించుట.

సర్వేశ్వరా స్వామీ మమ్మున్ను మీ దయచేత

మేము భుజించబోయే యీదానములనున్ను మాకు యేలినవారైన జేసుక్రీస్తునాథునియొక్క తిరుముఖముచూచి ఆశీర్వదించ నవధరించండి.

పితయొక్కనున్ను ఇత్యాది. ఆమేన్ జేసు.

---

భోజనము చేసినతర్వాత
ప్రార్థించుట.

సదాకాలమునకు నిత్యులైన సర్వవల్లభులైన సర్వేశ్వరా! దేవరవారు మాకివ్వనవధరించే సకల యుపకారముల కొరకుగాను దేవరవారికి మేలెరిగిన స్తోత్రము చేయుచున్నాము. పితయొక్కనున్ను ఇత్యాది. ఆమెన్ జేసు.

---

త్రీత్వస్తోత్రము.

పితకున్ను సుతునికిన్ని స్పిరీతుస్సాంక్తుకున్ను స్తోత్రము కలుగునుగాక.

ఆదిలో గలిగిన ప్రతిష్ఠ యిప్పుడున్ను యెప్పుడున్ను అనాది సదాకాలము స్తోత్రము కలుగునుగాక.

ఆమెన్ జేసు.

---

## జేసునాథునియొక్క దివ్యనామప్రార్థన

స్వామీ కృపగానుండండి,
క్రీస్తువా కృపగానుండండి,
స్వామీ కృపగానుండండి,
జేసువా మాప్రార్థన వినన వధరించండి,
జేసువా మాప్రార్థన ప్రతికారము దయచేయండి,
పరలోకమున ఉండెడు పితయైన సర్వేశ్వరా,
లోకమును రక్షించిన సుతుడైన సర్వేశ్వరా,
స్పిరితుసాంక్తువైన సర్వేశ్వరా,
త్రిత్వంతులై యుండెడు ఏక సర్వేశ్వరా,
నిత్యమైన సర్వేశ్వరునికి సుతుడైన జేసువా *
పితయైన సర్వేశ్వరునికి ప్రకాశమైన జేసువా
నిత్యకాంతియొక్క జ్యోతియైన జేసువా,
మట్టులేని మహిమగల రాజైన జేసువా,
నీతి సూర్యుడైన జేసువా,
పరిశుద్ధ కన్యమరియమ్మకు పుత్రుడైన జేసువా,
మితిలేని స్నేహమునకు పాత్రుడైన జేసువా,
ఆశ్చర్యమునకు తగిన జేసువా,

* మాకు దయచేసి రక్షించండి స్వామీ.

మితిలేని బలముగల దేవుడైన జేసువా,
వచ్చెడు యుగములకు పితయైన జేసువా,
పరమయోచనలకు దూతయైన జేసువా,
కడగురుతులేని త్రాణగల జేసువా,
మహా ఓర్పుగల జేసువా,
మహా శ్రవణముగల జేసువా,
శాంతమన దీనతగల జేసువా,
విరక్తత్వ ప్రియులైన జేసువా,
మా స్నేహమైన జేసువా,
సమాధాన దేవుడైన జేసువా,
మాప్రాణమునకు కర్తయైన జేసువా,
సమస్తపుణ్యముల మాతృకైన జేసువా,
ఆత్మరక్షణ కాంక్షకులైన జేసువా,
మా దేవుడైన జేసువా,
మా శరణమైన జేసువా,
దరిద్రులయొక్క పితయైన జేసువా,
విశ్వాసులకు నిక్షేపమైన జేసువా,
మంచిమేపరియైన జేసువా,
సత్యప్రకాశమైన జేసువా,
నిత్యజ్ఞానమైన జేసువా,
మట్టులేని మేలుస్వరూపముగల జేసువా,
మాజీవమును మార్గమునైన జేసువా

* మాకుదయచేసి రక్షించండిస్వామి.

సన్మనస్కులకు పరమానందమైన జేసువా,
పితాపిత్రులకు రాజైన జేసువా,
దీర్ఘదర్శులకు దూరదృష్టియైన జేసువా,
అపోస్తులకు గురువైన జేసువా,
సువిశేషకులకు బోధకులైన జేసువా,
వేదసాక్షులకు దృఢమైన జేసువా,
స్తుతియులకు ప్రకాశమైన జేసువా,
విరక్తులకు పవిత్రమైన జేసువా,
సకలమోక్షవాసులకు కిరీటమైన జేసువా,
జేసువా దయాపరులై యుండి,
మాపాపములను ఓర్వండిస్వామీ
జేసువా దయాపరులై యుండి,
మాప్రార్థన వినవధరించండి స్వామీ,
ఒక్కచేటురాకుండ, *
ఏపాపమురాకుండ,
మీకోపమురాకుండ,
పిశాచితంత్రములలో తగులుకొనకుండ,
అకస్మికముగా అయత్నములేని చావురాకుండ,
మోహాతంత్రములలో తగులుకొనకుండ,
నిత్యచావురాకుండ,
దేవరవారుయిచ్చేదు మంచిబుద్ధి మంచివిచార
ములను మేముత్రోసివేయకుండ

పూజారియొక్కడున్ను జనులున్ను చెప్పుట.

* జనులందరున్ను చెప్పుట.

దేవరవారి మనుష్యావతారమనెడు పరమ
రహస్యమును జూచి,
దేవరవారి జన్మమునుజూచి,
దేవరవారి బాల్యమునుజూచి,
దేవరవారి దివ్యనడతనుజూచి,
దేవరవారి ప్రయాసలనుజూచి,
దేవరవారి ఆరాటమును రక్త
చెమటనుజూచి,
దేవరవారి స్లీవనును పాటులనుజూచి,
దేవరవారి ఉపద్రవ నిర్బంధములనుజూచి,
దేవరవారిమరణమును భూస్థాపితమునునుజూచి,
దేవరవారి దేహ ఉత్థానమునుజూచి,
దేవరవారి మోక్షారోహణమునుజూచి,
దేవరవారి సంతోషమహిమనుజూచి,
స్పిరీతుసాంక్తుపుయొక్క ఆగమనమునుజూచి,
లోకముయొక్క పాపములను పరిహరించెడు స
ర్వేశ్వరునియొక్క దివ్యగొఱ్ఱెపిల్లయైన జేసు
వా! మాపాపములను ఓర్వండిస్వామీ,
లోకముయొక్క పాపములను పరిహరించెడు స
ర్వేశ్వరునియొక్క దివ్య గొఱ్ఱెపిల్లయైన జేసు
వా! మాప్రార్థన వినవధరించండిస్వామీ.
లోకముయొక్క పాపములను పరిహరించెడు స

మమ్మురక్షించుకొనండి స్వామీ.

, శ్వేశ్వరునియొక్క దివ్య గొఱ్ఱెపిల్లయైన జే
సువా! మాకుదయ చేసి రక్షించండిస్వామీ.

జేసువా మాప్రార్థన పననవధరించండి.

జేసువా మాప్రార్థన ప్రకారము దయచేయనవధ
రించండి.

వచనము:- ఇప్పుడును ఎప్పుడును ఎన్నటెన్నటికిని,

ఉత్తరము:- ఏలినవారి దివ్యనామము స్తుతింపబడు
నుగాక.

ప్రార్థించుదము.

మితిలేని దయారసముకలగిన జేసువా! మీా అ
ర్చిశిష్ట నామధేయముయొక్క బలిమిచేత మీారు
నాకు జేసువై యుండనును, మీాకు నేను ప్రియమై
న శిష్యుడై యుండనును చేయ కరుణించండి. నాకు
జీవమార్గమై యుండెడు మీాదివ్యపేరును నాహృద
యమందు వ్రాయనవధరించండి, అమృతమైన జేసు
వా! పరమశాంతమైన జేసువా! నాభక్తికి కారణ
మైన జేసువా! నాప్రాణాంత్య సమయములో జే
సువా అనెడు దివ్యవచనము ఉచ్చరించి అటువం
టిపేరుమీాద భక్తి అధికముచేత మీాకు నేను ఐక్య
మగునట్టు చేయ కరుణించండి జేసువా! జేసువా!

ఆమెన్ జేసు.

## దేవరతల్లి ప్రార్థనం

స్వామీ కృపగానుండండి
క్రీస్తువా కృపగానుండండి
స్వామీ కృపగానుండండి
క్రీస్తువా మాప్రార్థన విననవధరించండి
క్రీస్తువా మాప్రార్థన ప్రకారము దయచేయుండి
పరలోకమందుండెడు పితయైన సర్వేశ్వరా
లోకము రక్షించిన సుతుడైన సర్వేశ్వరా
స్పిరీతుసాంక్తువైన సర్వేశ్వరా
అర్చ్య- త్రిత్వాంతులై యుండెడు ఏకసర్వేశ్వరా
అర్చ్యమరియమా *
సర్వేశ్వరునియొక్క అర్చ్యమాతా
కన్యకలయొక్క అర్చ్యకన్యకా
క్రీస్తువుయొక్క మాతా
దేవయిష్టప్రసాదముయొక్క మాతా
మహా పరిశుద్ధమాతా
మహా విరక్తిగానుండెడు మాతా
నిర్మలమైనమాతా
కన్యశుద్ధము చెడని మాతా
స్నేహామునకు తగిన మాతా
ఆశ్చర్యమునకు తగినమాతా

* మాకొరకుగాను వేడుకొనండి.

*సృష్టికర్త యొక్క మాతా,
రక్షకునిమాతా,
మహావివేకముగల కన్యకా,
మహాపూజ్యమైన కన్యకా,
స్తుతింపబడ యోగ్యమైన కన్యకా,
శక్తిగల కన్యకా,
దయగల కన్యకా,
విశ్వాసముగల కన్యకా,
ధర్మముయొక్క అద్దమా,
జ్ఞానముయొక్క ఆలయమా,
మాసంతోషముయొక్క కారణమా,
జ్ఞానపాత్రిమా,
మహిమకుతగిన పాత్రిమా,
అత్యంతభక్తియొక్క పాత్రిమా.
దేవరహస్యముగల రోజాపుష్పమా,
దావీదురాజుయొక్క ఉప్పరిగా,
దంతమయమైన ఉప్పరిగా,
స్వర్ణమయమైన ఆలయమా,
వాగ్దత్తముయొక్క పెట్టె.
మోక్షముయొక్క వాకిలీ,
ఉదయకాల నక్షత్రిమా.
వ్యాధిగ్రస్తులకు ఆరోగ్యమా,

* యూరపుగాను వేయూర్సంది.

పాపాత్ములకు శరణమా,
కస్తి పడెడువారలకు ఆదరువా,
క్రీస్తువులయొక్క సహాయమా,
సన్మనస్కులయొక్క రాజ్ఞీ,
పితాపితృలయొక్క రాజ్ఞీ,
దీర్ఘదర్శులయొక్క రాజ్ఞీ,
అపోస్తులయొక్క రాజ్ఞీ,
వేదసాక్షులయొక్క రాజ్ఞీ,
స్తుతీయులయొక్క రాజ్ఞీ,
కన్యస్త్రీలయొక్క రాజ్ఞీ,
సకల అర్చ్యశిష్టులయొక్క రాజ్ఞీ,
జన్మపాపములేక ఉద్భవించిన రాజ్ఞీ,
మహాపరిశుద్ధ జపమాల రాజ్ఞీ,

లోకముయొక్క పాపములను పరిహరించెడు సర్వేశ్వరునియొక్క దివ్యగొఱ్ఱెపిల్లయైన జేసువా!- మాపాపములను ఓర్వ నవధరించండి స్వామీ.

లోకముయొక్క పాపములను పరిహరించెడు సర్వేశ్వరునియొక్క దివ్యగొఱ్ఱెపిల్లయైన జేసువా!- మాప్రార్థనపరికారము దయచేయండిస్వామీ.

లోకముయొక్క పాపములను పరిహరించెడు

సర్వేశ్వరునియొక్క దివ్యగోత్రపిల్లయైన జేసువా!-మాకు దయచేసి రక్షించండిస్వామీ.

వచనము. జేసునాథుని వాగ్దత్తములకు మేము పాత్రులమగునట్టు.

ఉ. సర్వేశ్వరునియొక్క అర్చ్యమాతా మా కొరకుగాను వేడుకొనండి.

ప్రార్థించుదము.

జగద్రక్షకులైన జేసువా! మీరు స్లీవక్రింద నిలిచియుండిన మీ దివ్యమాతను మీ ప్రియ శిష్యునికి తల్లిగా పాలించితిరే. ఇదుగో మాకును ఇంతటి సాదృశ్యమును అనుగ్రహించి దేవరవారు కాలప్రమాణమందు, నిజమైనమనుష్యులై జన్మించ తెలిసికొనిన అటువంటి అమ్మవారియొక్క బిడ్డలుగా ఉండెడు భాగ్యము మాకెప్పటికిని ప్రాప్తింపజేయ నవధరించండిస్వామీ. ఆమెన్ జేసు.



## అర్చ్యశిష్ట బెర్నార్దు దేవమాతను జూచి వేడుకొనిన జపము.

మిక్కిలి నెనరుగలతల్లీ, మీశరణముగా వరుగెత్తివచ్చి, మీయుపకార సహాయములను బతిమాలి మావేడుదల సహాయమును అడిగిన వారలయందు ఒకరైనను మీవల్ల చైవిడువబడినట్టు ఎన్నడును లోకములో వినినదిలేదని తలంప నవధరించండి, కన్యకలరాజ్ఞియైన కన్యకా! కరుణారసముగల తల్లీ! ఇటువంటి నమ్మికచేత ప్రేరేపింపబడి, మీదివ్యపాదములను సమీపించి వచ్చుచున్నాను. నిట్టూర్పు విడిచి ప్రలాపించి ఏడ్చేడు పాపియైన నేను మీాద తూాళమునకు కాచుకొని, మీసముఖములో నిలుచుచున్నాను. అవతరించిన వార్తయొక్కతల్లీ! నా విజ్ఞాపనమును త్యజింపక దయాపరులై విన నవధరించండి.

జన్మపాపము లేక ఉద్భవించిన అర్చ్యశిష్ట మరియమ్మా! పాపులకు శరణమా! ఇదిగో పరుగెత్తి వచ్చి మీశరణు జొచ్చితిమి. మామీాద నెనరుగానుండి, మాకొరకు మీదివ్యకుమారుని వేడుకొనండి.

ఇట్లు మూడు మారులుచెప్పి, ౧జో్య ౧ప్రి ౧త్రి.

# అనుక్రమణిక.

## మొదటిభాగము.

### సత్యవేదముయొక్క ప్రధాన పరమ రహస్యములను గురించి.

ప్రారంభము



## రెండవభాగము.

### మోక్షభాగ్యముపొందేటందుకు విశ్వసించవలసిన సత్యములను గురించి.

మూడవభాగము.

మోక్షభాగ్యము పొందేటందుకు అనుసరించవలసిన కల్పనలనున్ను పుణ్యములనున్ను గురించి.

## నాలుగవభాగము.

### దేవసాహాయ్యము పొందుటకు మనకు కలిగిన మూలములను గురించి.

పుట.



జ్ఞానోపదేశముయొక్క యుపభాగము.

పతితులను ఖండించుటకు తగిన న్యాయములు.





